# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 5010010027112

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మితవ్యయము

## ( THRIFT )

కృత్తివెంటి లక్ష్మీనారాయణచే

రచియింపబడి

రావుబహద్దూర్ యన్. రంగనాథాచార్యగారి

తొలిపలుకుతో

మచిలీపట్టణము

హిందూ ప్రెస్ నందు

ముద్రింపబడియె.

1932



బ్రహ్మశ్రీ
కీర్తిశేషులైన రావుసాహెబు
వేమూరి సుందర లక్ష్మీనరసింహారావు
పంతులుగారు.



# సహకారోద్యమము

## మితవ్యయము : THRIFT

### మొదటి అధ్యాయము

మితవ్యయమనగా యేమిటి ? మిత వ్యయము అను మాట గీర్వాణభాషకు సంబంధించినది. (మిత=హద్దుగల, వ్యయం=ఖర్చు) మితవ్యయమనగా హద్దుగల ఖర్చు అనగా పొదుపు. మానవుడు అవసరానవసరములను మంచి చెడ్డలను విచారించక యిష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టు దురభ్యాసమునకు వ్యతిరేకము మితవ్యయము.

### సహకారోద్యమము

సహకారోద్యమము మూడు మూలపీఠములమీద స్థాపింపబడి యున్నది. వాటిలో మొదటిది ముఖ్యమైనది—మితవ్యయము; రెండవది—స్వసహాయం; మూడవది—సత్ప్రివర్తన, ఈమూడు సద్గుణపుంజములతో గూడిన సహకారోద్యమము శుక్లపక్షచంద్రునిబోలె దేశమునకుశాంతిని, క్షేమమును కలిగించుచూ, దుర్భర దాస్య దారిద్ర్యంబులనెడి గాఢాంధకారంబునం

జిక్కి వారి తెన్నునుగానక నధోగతి పాలుగానున్న మానవకోటికి వారి జీవయాత్రలను సలక్షణముగ జరుపుకొనుటకు మార్గదర్శియగుచూ, దినదినాభివృద్ధిని బొందుచున్నది. సహకారోద్యమ కల్పవృక్షము సహకార సంఘములనెడి శాఖల మూలకముగ ప్రజలకు వివిధోపయోగకరములైన ఫలములను వెదజల్లుచున్నది. ఆఫలములను యనుభవించుచూ యావృక్షనీడను కోట్లకొలది జనులు సుఖముగ కాలక్షేపము చేయుచున్నారు. సహకార సూత్రముల ననుసరించి స్థాపింపబడిన సంఘములే సహకార సంఘములనబడును. అట్టి సహకార సంఘములతో బనిజేయు ఉద్యమమె సహకారోద్యమమనబడును.

ప్రారంభమున ఐరోపా దేశములలో ద్రవ్య సంపన్నులయిన భూస్వాములు—వర్తకులు, వారి ద్రవ్య మదాంధముచే ధనహీనులగు కూలిజనులను నానాయిడుముల పాలుచేయుచూ, వారి కష్టసుఖములను విచారించక నిరాదరణ చేయుచుండిరి. గాని కూలిజనుల సహాయములేనిది, ధనవంతులు వారి వ్యాపారములను సాగింపజాలకుండిరి. అయినను, కూలీలకు స్వల్పవేతనములను మాత్రము యిచ్చుచూ, వారు (ధనవంతులు) వారి వ్యాపారముల మూలకముగ నధికలాభములను బొందుచుండిరి. ఏది యెట్లున్నను, కూలీవానికి కూలీయేగతిగాని, వేరు లాభమేమియు కనబడకపోయెను. మరియు బజారులో వారికి గావలసిన సరుకుల ధరలా ప్రియము; సరుకుల నాణెమూ నాశి; ధనమును వెచ్చించినను మంచిసరుకు దొరుకుట దుర్లభమాయెను. కూలీలు ఎన్నివిధముల ప్రయత్నించి చూచినను, వారికష్టములు నివారణమగు మార్గము కాన్పించలేదు.

వారి యజమానులా వారికే నేవిధముగ జేయూత నొసంగుటకు నొల్లకుండిరి. దేశప్రభువులా, యాకాలములో నమలులో నున్న న్యాయశాస్త్రరీత్యా, కూలిజనులకు వారి యజమానులు యేవిధముగ దోడ్పడక పోయినను నిరాదరణభావముతో జూచుచు యూరకుండుట సంభవించెను. ఇకను వారిగతి యేమి? వారికి దిక్కెవరు? ఇట్లు వారు నానాటికి కృశించి యిడుముల పాలుకావడమేనా వారి విధాయకము? అని దేశములలో కలవరము తీవ్రముగ సాగనారంభించెను. ఇట్టి కలవరము ఆంగ్ల (England) దేశమున మిక్కుటమాయెను. ఆదేశీయులకు వలయు యాహార పదార్థములకుగాను పరదేశముల మీద నాధారపడి యుండుటయే కారణము. అనేక మంది వర్తకులు, దళారులద్వారా అట్టి పదార్థములు వచ్చుటచే వాటిధరలు మెండుగ పెరిగెను. స్వల్పకూలిజనుల బాధలు హెచ్చెను. ఆహారపదార్థములు చవుకగ సమకూర్చుకొనవలసిన యవసర మేర్పడెను. అందుచే ఆంగ్లదేశమున వుద్యమము సహకార వ్యాపార (వర్తక) రూపముదాల్చెను. ఐరోపాలోని కొన్ని దేశములలో ముఖ్యముగ జర్మనీదేశములో వ్యవసాయదారులు యధిక సంఖ్యాకులుగ నుండిరి. వారు సహితము పైవిధముగనే చిక్కులపాలగుచుండిరి. అప్పుడు మానవసేవను చేసి దేశోద్ధారణను గావించుటకు జర్మనీ దేశములో రెఫెసీను మహాపురుషు డుద్భవించి, యతివ్రియప్రయాసలకు లోనై సహకారతత్వములను బోధించుచూ సహకార సంఘములను స్థాపించెను. అట్టి సహకార సంఘములే యిప్పుడు నాగరిక ప్రపంచమంతటను వ్యాపించి కోట్ల కొలది

బీదజనులకు సహాయకారులై వృద్ధిని బొందుచున్నవి. ఆ మహా పురుషుడు గావించిన మహోపకారమునకు, యీ మహాము హుని పేరు శాశ్వితముగ నాచంద్రార్కము ప్రపంచమున స్థిర స్థాయిమై యుండుటకు సందేహమా? ఆయాదేశ పరిస్థితుల ననుసరించి సహకార వ్యాపార, పరపతి, వ్యవసాయ, గృహ నిర్మాణ, భీమా, మొదలుగాగల అనేక రకముల సంఘములు నాగరిక ప్రపంచమున అన్ని దేశములందును స్థాపితమయ్యెను. ప్రజాక్షేమమునకు ఈ సహకార సంఘములే మూలాధారమై యున్నవి. హిందూదేశమున వ్యవసాయకులు ఋణగ్రస్తత హెచ్చి కష్టముల పాలైనందున వారికి సహకార పరపతియే శరణ్యమయ్యెను. గనుక యీదేశమున సహకార సంఘమ నిన పరపతి సంఘమనియే జనసామాన్యమునకు దోచుచుండును.

—♦ సహకార సూత్రములు : సహకార సంఘములు ♦—

సహకార సంఘములను, వాటి విధ్యుక్త ధర్మములను, వాటిలో నిమిడియున్న సహకార సూత్రములను గురించి కొంతవరకు జదువరులకు బోధపరచినగాని సహకారోద్యమము నకు—మితవ్యయమునకుగల సంబంధా సంబంధములను వివర ముగ దెలుపుటకు వీలుపడదు. కావున సహకార సంఘములలో నిమిడియున్న ముఖ్య సహకార సూత్రములను గురించి యిం చుక ముందు విచారింతము.

ధనలేమిచే బీడింపబడుచున్న మానవులు వారి యార్థిక పరిస్థితులను జక్కపరచుకొనుటకును అందువల్లగలిగే లాభనష్ట ములను వారే యనుభవించుటకును, వారివారి యిష్టాను

సారము సమానభావముతో నేర్పడిన సంఘములే సహకార సంఘములు అని పిలువబడును. ఈ సంఘములలో నాల్గు ముఖ్య సహకారసూత్రములు యిమిడ్చి యున్నవి.

(1) సహకారసంఘములు ధనలేమిచే కష్టబడు బీదజనుల సహాయము నిమిత్తం పరస్పర సహాయసూత్రముతో నేర్పాటు చేయబడుచున్నవి.

(2) సహకారసంఘముల మెంబర్లందరికి సమాన హక్కులుండునుగాని వేరువిధముగ నుండుటకు వీలులేదు.

(3) సహకారసంఘములలో వ్యక్తులు వారివారి యిష్టము మీద చేరవలయునుగాని, మరియొకరి బలవంతముమీద గాని ప్రోత్సాహముమీదగాని జేరకూడదు.

(4) సహకారసంఘములు వాటిమెంబర్ల ఉపయోగము నిమిత్తం యేర్పర్చబడినవి గాని తదితరులకు గాదు.

పై సూత్రములను గురించి యించుక వివరముగ వ్రాయుదును.

(1) ధనహీనులకు ధనసహాయము జేయ నెవరు బూను కొనెదరు? అట్టివారికి ధనసహాయమును జేయుటయే స్వచ్ఛమైన సహకార మనబడును. దయార్ద్రహృదయముగల యే సత్పురుషుడైనను ధనహీనునికి ధన సహాయమును దానము మూలకముగ జేసిన జేయవచ్చును గాని ఋణరూపముగ నెవరు చేయ నిచ్ఛగింతురు! దానము జేయుటమూలముగ ధలహీనులను సోమరులుగ జేయుట సంభవించును. మరియు వారికి పాటుబడుస్వభావము తగ్గి తుదకు వారు యెందుకు బనికి రానివారుయగుట సంభవించును. అట్లు దానమును జేయుట

ప్రారంభించినపక్షమున, నెంతడబ్బు అయినను చాలదు. అంత డబ్బును దానము చేయబూనుకొనిన ధనికులుండుట సహితము కల్ల. అట్టిదానము సహితము యశాస్త్రీయము—యసంభవము. కావున ధనహీనులకు ధనమును ఋణముగ నిచ్చియే సహాయము జేయుట విధాయకము.

అది యెట్లు జరుగగలదు? ఈ విషయము సహకార సంఘముల మూలకముగ సలక్షణముగ జరుపబడ గలదు. కొందరి వ్యక్తుల కూడికయే సంఘ మనబడును. సహకార సంఘములలో నట్టి వ్యక్తులందరు ధనహీనులే అయి యుందురు. అందరు ధనహీనులగుటచే, అందరు ధన సహాయమునే గోరుచుందురు. వారందరికి గావలసినది ధనమే. ఆ ధనమును సంపాదించుటకే వారందరు సంఘముగ నేర్పడుట సంభవించు చున్నది. అట్టి సంఘము, ఐకమత్యము—పరస్పరానురాగము లకు బుట్టినిల్లు అయి యుండును. అట్టి సంఘములోని ప్రతి వ్యక్తియొక్క యాస్తికి విశేష విలువ లేకపోయినను, అందరి యాస్తిని కలిపినపక్షమున కొంత మంచి విలువ యేర్పడగలదు. అట్టి యాస్తిహామీమీద, దామాషాగా కొంత మొత్తము సంఘమునకు ఋణముగ సహకార బ్యాంకులవల్ల నివ్వబడును. ఆధనమును వ్యక్తులు వారిలో వారు పరస్పరహామీ మీద వారివారి యవసరములనుబట్టి వారివారి స్థితిగతులనుబట్టి పంచు కొనెదరు. పరిమితిలేని పూచీగల సంఘములకు నప్పుగ నివ్వ బడిన ధనమునకు, సంఘములోని మెంబర్లందరు సమూహాము గను ప్రత్యేకముగను పూచీ పడవలసి యుండును. ధనహీను లకు నేర్పడు సంఘములన్నియు పరిమితిలేని పూచీగల సం

ఘములే అయి యుండును. గావున సంఘ ప్రతిమెంబరు, వాని యప్పునుమాత్రము తీర్చుటకు ప్రయత్నములను సలుపుటతో జాలదు. ఇతర మెంబర్లుకూడ వాయిదానాటికి వారి వారి బాకీపైకములను చెల్లించునటుల జూచుటగూడ విధాయకము అయి యున్నది. లేనియెడల మంచివారియొక్క యాస్తికి సహితము క్షేమముండజాలదు. కావున సంఘములోని ప్రతివ్యక్తియు సంఘములోని యితర వ్యక్తుల స్థితిగతులను గురించియు, యోగక్షేమములను గురించియు విచారించుచుండ వలయును. మరియు సంఘములోని వ్యక్తులందరు ప్రతివ్యక్తియొక్క యోగక్షేమమును గురించియు స్థితిగతులను గురించియు విచారించుట విధాయకము అయి యున్నది. గావుననే Each for all and all for each (సంఘమునకు ప్రతివ్యక్తియు—ప్రతివ్యక్తికి సంఘము లేక, అందరికి ప్రతివారు—ప్రతివారికి అందరు) అనునది సహకారోద్యమ ప్రధాన సూత్రము అయి యున్నది. Each for himself (ఎవరికివారే) అను స్వార్థప్రయోజక సూత్రమును సహకారసంఘములలో స్మరించుటకు సహితము యవకాశ ముండకూడదు.

(2) సంఘములోని మెంబర్లందరు సామాన్యముగ ధనహీనులే యైయుందురు. మరియు వారందరికి నవసరముగ గావలసిన విషయము సహితము వకటే యైయుండును. అనగా వారందరికి ద్రవ్యసహాయమే కావలసియుండును. గావున సంఘములలోని మెంబర్లందరు సమానప్రతిపత్తి కలవారగుచూ ఒకేవిషయమునకుగాను పాటుబడువారు యైయుందురు. గావున మెంబర్లందరు సంఘములో ఒకరినొకరు సమానగౌరవము

త్రోనే చూచుకొనుచుందురు. మెంబర్లందరికి సంఘమహాసభల లో చర్చలలో పాలుగొనుటకు సమానయధికారము కలదు. మెంబర్లందరికి వారి యభిప్రాయములను దెలుపుచూ వోటు (Vote) నిచ్చుటకు సమానయధికారము కలదు. ప్రతి మెంబరుకు వక వోటు నిచ్చుటకు మాత్రమే యధికార ముండును. సంఘమహాసభలలోను పంచాయితీసభలలోను జరిపిన తీర్మానముల ననుసరించి ప్రతివ్యక్తియు బద్ధుడై ప్రవర్తించవలసియుండును. సంఘమెంబర్లందరు, వారివారి భిన్నాభిప్రాయములతో నిమిత్తములేకుండా, సంఘ నిబంధనల ననుసరించి సంఘక్షేమమునకుగాను పరస్పరసహాయమునకుగాను ఏకోన్ముఖులై కృషిని సలుపుటయే విధాయకము. ఏవిధమైన భేదములు లేకుండా, సహకారసంఘములలో సమానభావముతో వ్యవహారములు జరుగుచుండును. All are equal (అందరు సమానము) అనునది సహకారోద్యమ ద్వితీయ యాదర్శమైయున్నది.

(3) వ్యక్తులు వారివారి యార్థికపరిస్థితులు క్రమముగలేని హేతువుచే ననేక యిడుముల పాలగుట సంభవించును. తన్నివారణమునకు మార్గములను గానక అల్లాడుచుందురు. ధనహీనుడగుటచే, ఋణములనిచ్చుటకు నెవరును యంగీకరించరు. దొరికినను యధికవడ్డీరేటుతో దొరుకును. అట్టి యప్పు పుచ్చుకొనిన వానిని బాగుచేయుచుండుటకు బదులు దినదిన క్షీణదశకు దెచ్చుటకు సహాయపడుచుండును. గావున నసహాయులకు సహాయమునుజేసి నిలువబెట్టగల శరణాలయము సహకార సంఘములు అయియున్నవని వానికి బాగుగదెలిసి, వాటి సూత్రములయొక్క విలువను గురించియు, వాటి విద్యుక్త ధర్మము

లను గురించియు బాగుగ విచారించి దెలిసికొని, ' అన్యథా శరణం నాస్తి ' (వేరుగతిలేదు) అను దృఢనిశ్చయముతో సంఘములలో జేరకోరు వ్యక్తులే, సంఘములలో మెంబర్లగ నుండుటకు నర్హులు. అట్టివారే, సంఘములలో లభించిన పరపతిని యతి జాగరూకతతో కాపాడుకొనుచూ సంఘనిబంధనల ననుసరించి బహు భయభక్తులతో ప్రవర్తించుచూ సంఘాభివృద్ధికి దోడ్పడుటకు సంసిద్ధులై యుందురు. ఒకరి బలవంతముమీద గాని, ఒకరి ప్రోత్సాహముమూలకముగ గాని సంఘములలో మెంబర్లగజేరినవారు సంఘములకు విశేషఉపకారులుకాజాలరు.

(4) పై సూత్రముల ననుసరించి స్థాపింపబడిన సంఘములు, మెంబర్లగజేరిన వ్యక్తుల ప్రయోజనము నిమిత్తమే యేర్పడినవి గాని తదితరుల నిమిత్తము కావు. వాటిలో నప్పులు మెంబర్లకే నివ్వబడునుగాని యితరులు యెట్టిచిక్కులలో నుండియున్నను, యెన్నివిధముల ప్రార్థించినను యివ్వబడజాలవు. సంఘములలోని లాభములో క్షేమనిధినగై చాలను మినహాయించగా మిగిలినది, సంఘనిబంధనల ననుసరించి సంఘమెంబర్లకు మాత్రమే పంచిపెట్టబడుచుండును. సంఘ లాభనష్టములకు సంఘ మెంబర్లే సదా పూచీని వహించియుందురు. వారే సంఘ జవాబుదారీని, సంఘబాధ్యతను సంపూర్ణముగా వహించి సంఘోద్ధారణను గావించుచుందురు.

సంఘములలో మెంబర్లగజేరి సంఘాభివృద్ధికిగాను పాటుబడువారే, సహకారసంఘములవల్ల గలుగు సౌకర్యములను యనుభవించుటకు నర్హులు కాని, తదితరులు యీసౌకర్యములను యనుభవించుటకు నర్హులుకాగని సహకార సిద్ధాంతము.

సంఘ నిబంధనలకు బద్ధుడుకానట్టియు, సంఘ శాసనష్టము లకు బాధ్యుడుకానట్టియు, సంఘపూచీని వహించనట్టియు యి తరులకు సంఘసౌకర్యములను గల్గించకపోవడము సమంజసము గాను, సహేతుకరముగను యున్నదనుటలో యావంతయు సం దేహ ముండజాలదు.

పై సహకారసూత్రముల నాధారము మీదనే సహకార పరపతి సంఘములు వివిధప్రాంతముల స్థాపింపబడి వివిధోప యోగములను మానవకోటికి గావించుచుండెను. ధనహీనులు సంఘములుగ గూడి, వారి యవసరములకు గావలసిన పైక మును యప్పుగ దెచ్చుకొని వారివారి పనులను సలక్షణముగ జరుపుకొనుచున్నారు. సంఘములుగ నేర్పడక, ధనహీనులు వారికి గావలసిన పైకమునకుగాను ప్రయత్నించిన పక్షమున వారిలో చాలమందికి నప్పు దొరుకుటయే దుస్సాధ్యము. దొరికిన వారికి సహితము వడ్డీరేటు నధికముగ నుండును. అట్లు గాక సహకార సంఘములలో స్వల్ప వడ్డీరేటుతో గావలసిన పైకము సులభముగ దొరుకుచున్నది. పై విధముగనే వ్య క్తులు సంఘములుగ నేర్పడి వారికందరికి గావలసిన వస్తువులను సమ్మిష్టిగ గొనిదెప్పించిన పక్షమున, బజారులో ధరలకంటె చవుకగాను, బజారులో సరుకుకంటె మంచివిగాను, బజారులోని కొలతలు తూనికలకంటె సరియైన కొలతలతోను తూనికల తోను వస్తువులు దొరుకుట సంభవించును. మరియు ఇట్లే వ్యక్తులు సంఘములుగ నేర్పడి, వారమ్మదలచిన ధాన్యము వగైరాలను సమ్మిష్టిగ నమ్మినచో, ప్రతివ్యక్తియు ప్రత్యేకముగ నమ్మినదానికంటె యెక్కువ లాభమును బొందుటకు నవకాశము

కల్గుచున్నది. మరియు వ్యక్తులు సంఘములుగ నేర్పడి, విలువ గల వ్యవసాయ సామగ్రిలనుగాని, వుపయోగకరమైన విలువ గల యంత్రములనుగాని, గొన్ని తెప్పించిన, స్వల్ప రేటు అద్దెతో సంఘమెంబర్లు సదరు యంత్రములను సామగ్రులను వాడుకొనుటకు నవకాశము కల్గుచున్నది. ధనవంతులు యతి వ్రియ ప్రయాసలతో దెప్పించి వాడు యంత్రములు సామగ్రులువగైరాలవల్ల బొందు సౌకర్యములను సంఘములో మెంబరుగ చేరినందున, ధనహీనుడైనను యనుభవించుచున్నాడు. పై విధముగనే వ్యక్తులు సంఘములుగ నేర్పడి వివిధోపయోగకరమైన పనులను గావించుచూ, సుఖముగ జీవనములను గడుపుచున్నారు. 'సంఘె శక్తిః కలియుగే' అను నార్యోక్తి మన సహకారసంఘములలో సంపూర్ణముగ నిదర్శన మగుచున్నది. వీటి మూలకముగ ధనహీనులు సహితము వివిధసౌకర్యములను యనుభవించుచూ, వారిపరిస్థితులను వారు చక్కపరచుకొనుటయే గాక, ధనవంతులకుసహితము మనశ్శాంతిని కలుగజేయుచూ, అనేకవిధముల వారి వుద్యమములకు దోడ్పడుచున్నారు. అందు మూలకముగ దేశము శాంతముగను క్షేమముగను వుండుటకు గారణమగుచున్నది.

## —♦ పరపతి విలువ ♦—

సహకారసంఘములు, సహకార పరపతిసంఘములనియు, సహకారపరపతేతర సంఘములనియు రెండువిధములుగ విభజింపబడియున్నవి. సహకార పరపతిసంఘములను గురించి మాత్రమే మనము ప్రస్తుతము విచారించెదము. 'పరపతి' యనగా,

వలయును. ఇట్లు జరిపిన పక్షమున, సంఘములలో పారు బాకీలు విశేషముండజాలవు. మెంబర్లు సహితము కడు శ్రద్ధా భక్తులతో నేవిధమైన దుర్వ్యయమును జేయక, ముఖ్యావసర మైన ఖర్చులను మాత్రమే చేయుచూ, బహు పొదుపుగను మితముగను డబ్బును వాడుచూ సంఘబాకీని దీర్చుటకు కృషి సల్పుచుండును. ఇట్లు చేయక, నశ్రద్ధచేసి, వచ్చిన యాదాయపైకమును మితితప్పి వాడినపక్షమున, సంఘ పంచాయితీ దార్లు వేసిన యంచనా నిష్ప్రయోజకము యగుటయేగాక, సంఘములో బాకీని యేర్పర్చిన వాయిదానాటికి దీర్చుటకు, అందు మూలకముగ సంఘములో పరపతిని నిలుపుకొనుటకు నాస్కారముండజాలదు. సామాన్యముగ సహకార సంఘము లలో మెంబర్లు స్వల్పసంపాదనపరులు, స్వల్పయాస్తిపరులు అయి యుందురు. గావున వారి సంపాదన ద్రవ్యములోనుంచి కొంతభాగమును సంఘపంచాయితీవారి యంచనా ప్రకారము మినహాయించుచూ, యనవసరమైన ఖర్చులను జేయక, జీవ నోపాధికి ముఖ్యముగ గావలసిన ఖర్చులను మాత్రమే చేయు చూ, కాలమును గడుపుచుండినగాని సంఘబాకీ తీరజాలదు. గనుక సహకార సంఘములలోని ప్రతివ్యక్తియు మితవ్యయ సిద్ధాంతమును సంపూర్ణముగ ననుష్ఠానమందుంచినగాని, సహ కారోద్యమ కల్పవృక్ష నీడను విశ్రమించుటకు నర్హులు కాజాలరు.

"Without thrift no credit." పొదుపు పరపతికి పుట్టి నిల్లు. పొదుపుగలవారికే, పరపతి గల్గుటకు నవకాశము కల్గును. పొదుపుగల వారికే, ఋణబాధలేకుండగ జీవయా

త్రిను సలుపుటకు వీలగును. పొదుపుగల వారికే, సర్వార్థ సాధనియగు ధనమును సంపాదించి నిలువజేయుటకు నాస్కారముకల్గును. పొదుపుగల వారికే, సదరు ధనమువల్ల కల్గు సకలవిధ సౌకర్యములను యనుభవించుటకు భాగ్యము సంభవించును. పొదుపుగలవారికే, మానవకోటికి వివిధోపయోగకరములైన కార్యములనుజేసి యిహపరసౌఖ్యములను బొందుటకు కారణమగును. ఇంత చెప్పనేల. పొదుపుగనుండిన, ధనముండును. ధనముండిన, సకలమును సాధింపవచ్చును. "నాయందు లక్ష్యమున్నవానినే, నేను లక్ష్యముగజూతును" యని ధనదేవత చెప్పిచ్చుచుండునని యొక సామెతకలదు. ధనముయెడల లక్ష్యమే పొదుపు—మితవ్యయము.

పొదుపు విషయమై నొకమహానీయుడు యిట్లు చెప్పెను.

"It is the daughter of wisdom, the sister of temperance, and the mother of freedom."

అది వివేకమునకు కుమార్తె, మితమునకు సోదరి, స్వాంతంత్ర్యమునకు తల్లియై యున్నది.

—♦ డిపాజిట్లు ♦—

మరియు మరియొక ముఖ్యవిషయమును సహకార సంఘములలోని ప్రతివ్యక్తియు గమనించవలసి యున్నది. సహకార సంఘములు వాటి మెంబర్లకు నిచ్చుటకు ద్రవ్యమును యెక్కడనుంచి సంపాదించుచున్నది? డిపాజిట్లే సహకారోద్యమమునకు మూలాధారమగుచున్నవి. డిపాజిట్లనగా యేమిటి? వ్యక్తులు వారి సంపాదన పైకమును, వూరక వారివద్దనే వుంచుకొనిన పక్షమున లాభముండదనియు, లోకులకు నిచ్చిన వారు క్రిమ

ప్రకార మివ్వనిపక్షమున నానాయిడుముల పడవలసివచ్చున
నియు భయముతో, బ్యాంకులలో — నియమితకాలపరిమితితో
ధారిచ్చువడ్డీ రేటుప్రకారము దాచుకొనుచున్నారు. సదరు
వడ్డీ సామాన్యముగ నారు మాసముల కొక పర్యాయము
యివ్వబడుచుండును. మరియు వాయిదా ఆఖరున యావత్తు
డిపాజిట్లు పైకము అప్పటికి బాకీయున్న యావత్తు వడ్డీ
మొత్తముతో డిపాజిటర్కు వాపసుచేయబడును; లేదా, తిర్గి
యదేప్రకారము పైకము యవసరము లేనియెడల డిపాజిటు చేసు
కొనుచుండవచ్చును. బ్యాంకువారు యీపైకమును యధిక
వడ్డీరేటుతో లోకులకు తగు జామీనుమీద యప్పులుగ నిచ్చి
లాభమును పొందుచుందురు. బ్యాంకులు ధనవంతుల వద్ద
డిపాజిట్లు మూలకముగ స్వల్పవడ్డీ రేటుతో ద్రవ్యమును స్వీక
రించి, యాద్రవ్యమునే యధికవడ్డీరేటుతో ధనము కావలసిన
వారికి నప్పులుగనిచ్చి త్రిప్పుచూ లాభమును బొందుచున్నారు.
అప్పు పుచ్చుకొన్నవారు క్రమముగ నివ్వనిపక్షమున బ్యాంకు
నష్టపడుటయేగాక, డిపాజిటర్లు సహితము బహుచిక్కుల పాల
గుదురు. ఈ విధముగనే సహకార బ్యాంకులలో సహితము
పనులు జరుగుచున్నవి. గాని సహకారోద్యమములో బ్యాం
కులు డిపాజిట్ల మూలకముగ సంపాదించిన సొమ్ము బీదల సహా
యార్థము పరిమితిలేని పూచీగల సంఘములకు నప్పులుగ నివ్వ
బడుచుండును. తదితర బ్యాంకులలో నట్లుగాక ధనవంతులకే
డిపాజిటు పైకము వాడబడుచుండును.

సహకారోద్యమమందలి సంపూర్ణవిశ్వాసముచే లోకులు,
పురుషులు, స్త్రీలు, ధనవంతులు, ధనహీనులు, ఉద్యోగులు

కూలివాండ్రు, సంఘములలోను, సెంట్రలు బ్యాంకులలోను, రాజధాని బ్యాంకులలోను విరివిగ వారి ద్రవ్యమును డిపాజిట్ల మూలకముగ దాచుకొని సుఖముగ కాలమును గడుపుచుండిరి. డిపాజిట్లమూలకముగ డబ్బును దాచుకొనుటకు డబ్బు యెట్లు లభించును? వ్యక్తులు వారి వారి స్వప్రయోజకత్వము చేతను కృషిసల్పి సంపాదించిన ద్రవ్యమును మితముగ వాడుకొనుచూ యనవసరమైన ఖర్చులను జేయక మిగిల్చినద్రవ్యమునే డిపాజిట్ల మూలకముగ దాచుకొనుచున్నారు. ఏరికైనను, మితవ్యయమును యభ్యసించనిపక్షమున, ద్రవ్యము మిగులుట కల్ల. డిపాజిట్లనుచేయుట భ్రమ.

సహకారసంఘములలో ధనవంతులసొమ్ము ధనహీనుల వుపయోగము నిమిత్తం వాడబడుచున్నది. ధనవంతులు మితవ్యయముతో సంపాదించిన సొమ్మును, ధనహీనులు సహితము మితవ్యయముతోనే వాడుకొనుచూ, లాభమును సుఖమును బొందుదురుగాత. సహకారసంఘములలోని ప్రతి వ్యక్తియు మితవ్యయదీక్షను బూని, యతికఠినముగ ననుష్ఠానమం దుంచిన గాని, వాని బాకీలను వాయిదాలప్రకారము చెల్లించుటకు వీలు పడదు. సంఘము బాగుపడజాలదు. మిత వ్యయమే, ధనవంతులకు-ధనహీనులకు పరస్పర ముపయోగకారియును, లాభకారియును యగుచూ, అందరు సుఖముగ కాలక్షేపమును జేయుటకు నవకాశమును కలుగజేయుచున్నది.

"సర్వేజనాః సుఖినోభవన్తు".

గ్రంథబాహుళ్యమగుననే భయముచే సహకార పరపతి సంఘములను గురించి ప్రస్తుతాంశమునకు సంబంధించినంతమట్టుకే

క్లుప్తముగ వ్రాసియుంటిని. నేను లోగడ ప్రచురపరచిన "గ్రామ సహకార పరపతి సంఘములు" అను పుస్తకములో పరపతిసంఘములను గురించి యావద్విషయములు సంపూర్ణ ముగ వివరింపబడియున్నవి.

## రెం డ వ అ ధ్యా య ము

మొదటిఅధ్యాయములో సహకారోద్యమమునకు మిత వ్యయమునకు గల సంబంధము వివరముగ వ్రాయబడియున్నది. మితవ్యయ ముండినగాని వ్యక్తి బాగుపడజాలడు. వ్యక్తి బా గుగనుండినగాని సంఘము బాగుపడజాలదు. సంఘము బాగుగ నుండినగాని, వుద్యమము బాగుపడజాలదు. గనుక మితవ్యయము సహకారోద్యమమునకు ప్రధాన మూలపీఠము అయియున్నది.

మితవ్యయ మనునది సర్వదేశములయందు—సర్వావస్థల యందు—సర్వకాలములయందు—సర్వ విషయములలోను ప్రతి మానవునివల్ల ననుష్ఠానింపబడవలసిన విషయము అయియున్నది. మితవ్యయము అనగా హద్దులోబడి ఖర్చు జేయుట; అనగా అవసరమునకు ననుగుణ్యముగ ఖర్చుజేయుట. విలువగలవస్తు వును వాడుటయే ఖర్చు యనబడును. ప్రపంచకములోని ప్రతి వస్తువు దేశ కాల పరిస్థితులననుసరించి విలువను కలిగియేయుం డును. అట్టి వస్తువులలో ధనము అనగా డబ్బు (బంగారము, వెండి) మిక్కిలి ప్రాధాన్యమైనది. అట్టి ధనమునుగురించి యీ యధ్యాయములో గొంతవరకు విస్తరించి వ్రాయబడును.

'ధనమూల మిదం జగత్' అను నార్యోక్తి సమస్త జనవిదితవిషయంబేగదా. కృపాజలనిధియును, శరణాగతవత్సలుడును, సృష్టిపాలనకర్తయును అయిన శ్రీ మహావిష్ణువుయొక్క వక్షస్థలమందు సదా నివసించు శ్రీ మహాలక్ష్మీదేవియొక్క స్వాధీనమందు ధనమంతయు యుండుననియు, అష్టదిక్పాలులలో నుదీచి దిక్పాలకుడైన కుబేరుడు (ధనదుడు) యోగ్యతాయోగ్యతలనుబట్టి మానవులకు నాధనము నిచ్చుచుండుననియు పురాణగాధలు ఘోషించుచున్నవి. అందులకు ప్రమాణముగనే, మనవారు శ్రీ మహాలక్ష్మి కటాక్షవీక్షణములకు పాత్రులగుటకు గాను ననేక వ్రతములను యాగములను సల్పి బహువిధముల వ్రయప్రయాసలకు లోనగుచున్నారు. అదేప్రకారము కుబేరునికి సహితము సత్కృతులొనరించుచున్నారు. లక్ష్మీకటాక్షమునంగాని ధనము మానవునికి జేకూరదు. గనుకనే ధనవంతులను లక్ష్మీపుత్రులని పిలువ సాహసింతురు. అట్టి చేకూరిన ధనమును కొందరు ధనలక్ష్మిగా భావించి, బహు భయభక్తులతోను, అతి గౌరవముతోను, బహు లక్ష్యస్వభావముతోను కాపాడుచుందురు. ధనముయెడల నట్టి లక్ష్య స్వభావమే మితవ్యయమునకు మూలకారణ మగును.

మరియు "ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః" అను భర్తృహరి వాక్యము ననుసరించి, పాలుమాలక కృషి సల్పు మానవశ్రేష్ఠునికి లక్ష్మీదేవియు ప్రసన్నురాలై కోరు వరముల నొసంగుటకు సంసిద్ధురాలై యుండును. అట్లు కష్టపడి సంపాదించిన ధనమును యేపురుషుడైనను దుర్వినియోగపరచుటకు నిచ్ఛగించునా? బహు పదిలముగ గాపాడుచూ, అత్య

వసరమైన ఖర్చులకు మాత్రమే వాడుచూ, కాలక్షేపమును చేయుచుండును. అట్లు గావించుటయే మితవ్యయమనబడును.

## —♦ ధనమనగా యేమిటి ♦—

విలువగల ప్రతివస్తువు ధనమని పిలువబడవచ్చును. ఎట్టి హీనమైన వస్తువునకు నయినను మానవుల యవసరమును బట్టి విలువకల్గు చుండును. ఉపయోగము తెలియక పనికి రానిదని భావించుటయే కాని ప్రపంచకములోని ప్రతివస్తువు మానవునికి నుపయోగకారియే యగుచుండును. భగవంతుడు సమస్తజీవరాసులను సమస్త ఓషధులను సమస్తపదార్థములను పరస్పర సహకారమునిమిత్తమే సృష్టించి యున్నాడు. కావున మానవులకు ప్రపంచకములో నిరుపయోగకరమైన పదార్థము యేదియు యుండజాలదు. ఉపయోగకరమైన ప్రతి వస్తువునకు విలువ వుండితీరును. మన యనుభవమునుబట్టి నీవిషయమును ప్రతి దినమున మనము గ్రహించుచునే యున్నాము. దినవాడుకవల్ల గృహముల నావరణములలో నేర్పడు మనకు పనికిరాని బూడిదె వగైరా పెంటకుప్పలు సహితము యెరువుకుగాను పొలములలో వాడబడుచున్నది. సదరు పెంటకుప్పను వ్యవసాయదారులు విలువనిచ్చి కొని పొలములలో వాడుచున్నారు. మరియు పొలములలో వేయుటకు నెరువుకుగాను పశువుల పేడ, పొలములు లేనివారివద్ద యెంతప్రియముగ కొని వాడబడుచున్నదో వ్యవసాయదారులకు బాగుగ విదితమయ్యే యున్నది. మరియు మ్యూనిసిపాలిటీలవల్లను, యూనియను బోర్డులవల్లను వారి వారి వీధులలో నూడ్చిగ పోగుచేయబడిన పెంటయంతయు

సంవత్సరమున కొకపర్యాయము వేలము వేయబడగా, వ్యవసాయదారులవల్ల కొనబడి పొలములలో నెరువుగ వాడబడు చున్నది. సదరు పెంట ఖరీదు సహితము ప్రతిసంవత్సరము విశేషముగ నభివృద్ధిని పొందుచున్నది. మనకు పనికిరాదని భావించి పారవేసిన పెంట సహితము యేవిధముగ నుపయోగింపబడుచున్నదో యెట్టివిలువను దెచ్చుచున్నదో చూచుచున్నాము. పశువులు చనిపోయినపిమ్మట వాటి చర్మములు, వాటి బొమికలు, వాటి కొమ్ములు సహితము యతిప్రియ ప్రయాసలకులోనై కొనబడి, బహువిధముల నుపయోగింపబడి మానవులకు ననేకవిధముల దోడ్పడుచూ లాభమును కలుగ చేయుచున్నవి. ఇసుక, బూడిదెల సహాయముతో ప్రతి దినము మనమువాడు దివ్యముగ ప్రకాశించునట్టియు, పరిశుభ్రమైనట్టియు గ్లాసు చేయబడుచున్నది. మరియు పనికిరాని కాగితములు—గుడ్డపీలికలతో, ప్రతి దినము మనమువాడు కాగితములన్నియు తయారు చేయబడుచున్నవి. ఇదేవిధముగ పనికిరావని భావింపబడు వస్తువులనుంచి వివిధోపయోగకరములైన వస్తువులు తయారుచేయబడి పనికిరాని వస్తువులకు సహితము విలువను కలుగజేయుచున్నవి. కొన్ని సమయములలో మన యవసరమునుబట్టి మన్నును సహితము విశేషధరకు గొనుచున్నాము. ఔషధములకుగాను యరణ్యములలోను, పర్వతములమీదను పెరుగు వృక్షముల వేరులు—దుంపలు—ఆకులు వగైరాలను నధిక వెలకు గొని వాడుచున్నాము. ప్రతివస్తువునకు వాటియోగ్యతాయోగ్యతలను బట్టియు, మానవుల యవసరానవసరములబట్టియు, విలువయధికముగనో హీనము

గనో యేర్పడుచుండును. పరికించిచూడ ప్రపంచకములో పనికిరాని వస్తువేదియు కానరాదు; అనగా ప్రతివస్తువు వుప యోగింపదగిన వస్తువనియు, దానికి విలువగలదనియు స్పష్టమగు చున్నది. గావున ప్రపంచమంతయు ధనమయమనియే చెప్ప వచ్చును. అట్టి ధనసహకారములేనిది ప్రపంచకములో నే వ్యవహారము తుదముట్టనేరదు. గనుకనే "ధనమూలమిదం జగత్" యని చెప్పబడుచున్నది.

ప్రపంచమంతయు ధనమయమై యెటుజూచినను ధనము గోచరమగుచున్నప్పుడు, ధనవంతులనియు ధనహీనులనియు మాన వులలో భేదము యేలకలుగవలయును? ధనవంతులకు ధనహీనుల కంటె నాధిక్యత యేలనుండవలయును? వారు సల్పు కృషి నను సరించియు, వారి పూర్వజన్మసుకృతము ననుసరించియు, మానవు లకు ధనము పలువిధములుగ లభించుచుండును. కొందరికి పొల ములు విశేషముగ నుండి ధాన్యము సమృద్ధిగ నుండుట సంభవిం చును. కొందరికి వెండి-బంగారములు సమృద్ధిగ నుండుట సంభవిం చును. మరికొందరికి పశువులు సమృద్ధిగ నుండుట సంభవిం చును. అదేవిధముగ పలువురికి పలువిధముల ధనము సమృద్ధి గనుండుట సంభవించును. అట్లు సంభవించుట మానవులు సల్పు కృషికి ననుగుణ్యముగనే యుండును. "చేసుకొనినవారికి చేసుకొన్నంత, మహాదేవ" యను సామెత ననుసరించి కష్టపడి వొళ్ళు దాచుకొనక కృషిసల్పిన వానికి బాగుగ లభించును; బద్ధకించిన వానికి నేమియు లభించనే లభించదు. గావున మానవులు సల్పు కృషి ననుసరించియే ధనవంతులు ధనహీనుల భేదము కలుగుచున్నది. సమృద్ధిగ నున్నవారు సమృద్ధిగ లేని

వారికంటె నాధిక్యతను బొందక తప్పదు. ధనసమృద్ధిచేత, ధనహీనుల చేతకాని వివిధ విషయములను ధనవంతులు చేయ గలరు. ఇంతయేల. ధనహీనులకు వివిధోపయోగ కరము లైన సౌకర్యములను కలుగజేసి, 'పరోపకారార్థ మిదంశరీరం' అను యార్యోక్తిని సార్థకపరచుకొని ధన్యులగుచున్నారు. అట్టి పరిస్థితులలో ధనవంతులకు ధనహీనుల కంటె నాధిక్యతయు, యెక్కుడు గౌరవము వుండుట సహజము. విధాయకము.

ఇంతవరకు, ప్రపంచములోది ప్రతివస్తువునకు విలువ గలదనియు, అట్టి ప్రతివస్తువు ధనమనియు చెప్పియుంటిమి. గాని వాడుకలో మాత్రము కోటీశ్వరులనియు, లక్షాధికారులనియు విశేష ధనవంతులనియు, వారివారికిగల సువర్ణ రజిత సంచయ-ముల ననుసరించి పిలువబడుచున్నారు. విశేష భూములుండిన పక్షమున మొఖాసాదారులనియు, జమీనుదారులనియు పిలువ బడుచుందురు. అదేవిధముగ పలువిధముల ధనములుగలవారు పలువిధముల నామములతో ప్రజలవల్ల గౌరవింపబడుచునేయు న్నారు. లక్షాధికారులనుపేరు మొదలు భిక్షాధికారులుఅనుపేరు వరకు పేరులు వారివారికి గల ధనము ననుసరించి కలుగుచున్నవి.

## నాణెముల యవసరము

పూర్వపు దినములలో నేవిధములైన నాణెములు వాడు కలో నుండియుండలేదు. నాణెముల ముఖ్య వుపయోగము మనవద్ద లేని వస్తువులను నాణెముల నిచ్చి కొనుటయేగదా (Exchange). అట్టిది పూర్వపుదినములలో పంట ధాన్యముల మార్పుదల మూలకముగ సులభముగ జరుగుచుండెను. ఇ

టికిని గ్రామాదులలో పంటధాన్యము నిచ్చి యమ్మవచ్చిన కూరగాయలు—ఫలములు వగైరాలను కొను వాడుక యాచరణ లో నుండియున్నది. నాణెములకు బూర్వము, యీపద్ధతియే బహు బాహుళ్యముగను విరివిగను యాచరింప బడుచుండెను. భగవత్ సృష్టి చిత్రము ననుసరించి, యన్ని దేశములలోను ఒకచేతరహా పంటలు పండవు. దేశకాలపరిస్థితుల ననుసరించి వివిధప్రాంతములలో వివిధపంటలు పండుచుండును. ఉష్ణ దేశ ములలో పండు పంటలు—కూరకాయలు—ఫలములు వేరు; శీత లదేశములలో పండు పంటలు—కూరకాయలు—ఫలములు వేరు. మన చెన్నపురి రాజధానిలోనే, కొండల ప్రాంతముల పండు పంటలు వేరు; నీలగిరి—వృదకమండల ప్రాంతముల పండు పం టలు వేరు; మలబారు—కనడాజిల్లాలలో పండు పంటలు వేరు; తదితరప్రాంతముల పండు పంటలు వేరు. సముద్రప్రాంతముల ఉప్పు సమృద్ధిగ లభించును. ఉప్పు సకలజనులకు నవసరమైన వస్తువుగదా. ఉప్పు సమృద్ధిగా పండు ప్రాంతముల మరియే విధమైన పంటయు పండుట కష్టము. గావున ఉప్పు కావలసిన వారు వారిదేశములలో ఫలించు పంటలువగైరాలను దెచ్చి, ఉప్పు పండు ప్రాంతముల నివసించువారికి నమ్మి, వాటి ఖరీదు ప్రత్యామ్నాయముగ ఉప్పును దీసుకొనిపోవుచుండు వాడుక కలదు. శ్రమమైన రహదారీలు—కాలువలు—రైళ్లు లేనిరోజు లలో, లంబాడివారు వారి యెడ్లతండాలతో నీ వ్యాపారమును బహువిరివిగ జరిగించుచుండెడివారు. ఇదేవిధముగ నకరికి గావలసిన వస్తువులకుగాను వారివద్దనున్న సరుకులనిచ్చి, కావల సిన వస్తువులు వున్నవారిదగ్గర కొనుచుండెడివారు. ప్రభుత్వ

మువారికి నివ్వవలసిన తహసీలు సహితము రహితువద్దనున్న ధాన్యముతోనే చెల్లింపబడుచుండెను. ఆదినములలో నేవిధము లైన నాణెముల యవసరము లేకయే వ్యవహారము లన్నియు జరుగుచుండెను. కాని కాలము జరిగినకొలది, పలు విధము లైన చిక్కులు సంభవింప ప్రారంభించెను. కొండప్రాంతము లలో పండు చింతపండు సమృద్ధిగగలవారికి, సముద్ర ప్రాంత ముల లభించు ఉప్పు కావలసియుండునని యనుకొనుడు. కాని ఉప్పు గలవారికి, చింతపండు వకపర్యాయమే లోగడ విశేష ముగ కొని నిలువజేసి యుండుటచేతనో, మరి యే యితరకార ణముచేతనో యవసరము లేకపోవచ్చును. అట్టి స్థితిలో చింత పండు సమృద్ధిగ నుండి ఉప్పుకావలసినవారి గతి యేమి కావల యును? కొన్ని దేశములలో వర్షములు క్రమముగ లేని హేతు వుచేతను, భూములు మంచి బలమైనవి ఫలవంతములైనవి కాని హేతువుచేతను, పంటలు క్రమముగ లేక, ఆయాప్రాం తముల నివసించు జనులకు సహితము ఆపంటలు చాలక నిబ్బం దిపడుట సంభవించుచుండెను. వారిపంటలు వారికే చాలని పరిస్థితులలో వారికి లేని వస్తువులను సంపాదించు టెట్లు? కొన్ని సమయములలో వారివద్దనున్న సరుకులను విడుదలచేసి, కావ లసిన సామగ్రిలను దెచ్చుటకు, దూరభార ప్రయాణములను సలుపవలసి వచ్చుచుండెను. అట్టి ప్రయాణములను జేయు టకు శక్తిసామర్థ్యములు చాలక నిబ్బంది పడుట సంభవించు చుండెను. దూరప్రయాణములకు లక్ష్యముసేయక, కష్టము లకు నోర్చి వెళ్లినను, కావలసినంత సరుకులు దొరకకబోవుట సంభవించుచుండెను. అందువల్ల పడిన శ్రమయంతయు వ్యర్థ

మగుట సంభవించుచుండెను. పై చిక్కులన్నిటిని నివారణ చేయుటకుగాను, పలువిధములైన ప్రయత్నములు సలుపబడి, తుదకు లోహయుగములో లోహములతో నాణెములు చేయబడి వాడబడుట ప్రారంభింపబడెను. అనగా ప్రస్తుత మాదిరిగ లోహనాణెముల నిచ్చి, కావలసినవస్తువులు కొనబడుచుండెను. పై చిక్కులను నివారణచేయుటకు గావలసిన వస్తువు సాధ్యమైనంత యెక్కువ విలువకలది నైనగాని, స్వల్పముగ నిచ్చిన చాలదు. స్వల్పముగ నుండినగాని, ప్రయాణములలోను తదితర సమయములలోను సులభముగ తీసుకొనిపోబడుటకు వీలుగ నుండజాలదు. మనకు దొరకు యన్నిపదార్థములలో, లోహములు విశేష విలువగలవి యైయున్నవి. లోహములన్నిటిలో బంగారు మిక్కిలి విలువగలది. తరువాత వెండి, తరువాత రాగి విలువగలవి. గావుననే చిరకాలమునుంచి నాణెములు లోహములతో జేయబడి వాడబడుచున్నవి. చింతపండు సమృద్ధిగ నున్నవారు చింతపండును యమ్మి ఖరీదుకుగాను నాణెములను పుచ్చుకొని సదరు నాణెములతో వారికి గావలసిన సరుకులను గొనుచుందురు. సదరువిధముగ వ్యాపారము బహు సులువుగను బహు విరళముగను జరుపబడుచున్నది.

## తూనిక: కొలత పనిముట్లు

ప్రారంభమున వ్యాపారమంతయు తూనికలు—కొలతలు లేక ముఖదృష్టితోనే జరుపబడుచుండెను. కాలము గడచిన కొలది, వ్యాపారమును క్రమమైన పద్ధతులమీదనడుపుట యవసరమని భావించి, తూనికలు—కొలతలు యమలులో బెట్టబ

డెను. మనపూర్వీకులు ప్రారంభమున కొయ్యపనిముట్లతోను, దర్మిలా రాతి మన్ను పనిముట్లతోను, తర్వాత లోహపనిముట్ల తోను కాలమును గడుపుచుండెడివారు. అదేవిధముగ తూని కె-కొలత పనిముట్లు సహితము పారిరంభమున కొయ్యతోను, దర్మిలా రాయి మన్నుతోను, దర్మిలా లోహములతోను చేయ బడి వాడబడుచుండెను. ఇప్పటికిని కొన్నికొన్ని స్థలములలో మూడువిధములైన పనిముట్లు వాడబడుచుండగా చూచుచునే యున్నాము. మన గృహోపకరణములలో సహితము మాను గిన్నెలు, రాచిప్పలు, కుండలు, లోహపాత్రిలు అను నాలుగు విధములైన పాత్రిలను వాడుచునేయున్నాము. ప్రిస్తుత నవ నాగరికత రోజులలో సహితము, మనపూర్వీకులు వాడు కొయ్య రాతి సంబంధమైన పాత్రలను వాడుచుండుటయే వారి యాధిక్య తను క్రియారూపేణ వెల్లడిచేయుటయే గాక, వారిని గౌరవిం చుట సహితము సంభవించుచున్నది. ప్రస్తుతము మనమువాడు పింగాళీ-గాజుపాత్రలకంటె, మానుగిన్నెలు-రాచిప్పలు-లోహ పాత్రిలు యెన్నిరెట్లు గట్టిగను-నిర్భయముగను వాడుటకు వీల గునో చదువరులకే విదితము. ప్రిభుత్వమువారు దేశమందం తటను కొలతలు-తూనికలు నొకవిధముగనేయుండులాగు నేర్పా టులను గావించి, సదరు పనిముట్లు ప్రిభుత్వోద్యోగియుల వల్ల నంగీకరింపబడినట్లు సూచనగ, గురుతులు వేయబడుచున్నవి.

## —♦ బంగారు : వెండినాణెములు ♦—

నాణెములు బంగారు వెండి మొదలైన లోహముల తో జేయబడుచున్నవి. మన దేశములో, నితర దేశములలో

వలె, బంగారు నాణెములు విశేషముగ చలామణిలో లేవు. నవరస్నలు, మొహారీలు, కాసులు అను వివిధరకముల బంగారు నాణెములు వాడుకలోనుండి యున్నవి. వీటిధరలు బంగారుధర ననుసరించి హెచ్చుతగ్గు లగుచుండును. మన దేశములో బంగారు నాణెములు విశేషముగ నాభరణముల నిమిత్తము వాడ బడుచుండును. వెండినాణెములు (రూపాయలు, అర్ధరూపా యీలు, పావలాలు) మూడు విధములు ప్రస్తుతము యములు లోనుండి యున్నవి. లోకసామాన్య వ్యవహారములకుగాను, ఒకరూపాయికి రెండు అర్ధరూపాయిలనియు, నాల్గు పావలాల నియు, యెనిమిది అర్ధపావలాలనియు, పదహారణాలనియు, యరువదినాల్గు కానులనియు, వకవందనూట తొంబదిరెండు పైసలు అనియు, మారకము యేర్పడియున్నది. అదేవిధముగ పై నుదహరింపబడిన వివిధ నాణెములకు వాటికి ననుగుణ్యా ముగ విలువయేర్పడి చలామణి యగుచున్నవి. ప్రజాసా మాన్య సౌకర్యమునకుగాను పై నాణెములు యేర్పాటు చేయ బడి, ప్రతిదినమున విరివిగ వాడబడుచుండిన హేతువుచే, వ్యవ హారములన్నియు సలక్షణముగ జరుగుటకు నాస్కారము కల్గు చున్నది.

## —♦ కరెన్సీ నోట్లు ♦—

కాని యీనాణెములను విశేష సంఖ్యలుగ నొకచోట నుంచి మరియొకచోటుకు తీసుకొనిపోవుట భారముగాను, దొం గల భయముచే కడు నుపద్రవకరముగను గానబడుచుండెను. ఇట్టిస్థితిలో ప్రభుత్వమువారు ప్రజాసౌకర్యమునకుగాను (Post

Office) పోస్టాఫీసులను యేర్పర్చి, వాటిలో (Money order) మణియార్డరు పద్ధతిని యేర్పాటు చేసియుండిరి. అందుమూలముగ రు 600 లకు మించకుండా యెంత మొత్తమునైనను నూటికి వకరూపాయి కమీషన్తో మనము పంపదలచిన పరదేశములోనున్న వ్యక్తికి అందచేయవచ్చును. పంపదలచిన మొత్తము రు 600 లకు మించకూడదనే నిషిద్ధము, అంతకంటె పెద్ద మొత్తములను బంపవలసివచ్చినపుడు యిబ్బందిగ గనబడుచుండెను. మరియు విశేషసంఖ్యగల రూపాయీలు వగైరాలను, దూరప్రాంతములకు జేయు ప్రయాణములలోను, నిత్యకృత్యే వ్యాపారములలోను తీసుకొనిపోయి వాడుకొనుట కడుదుస్సాధ్యముగ గనబడుచుండెను. ప్రారంభమున వ్యాపారము సరుకుల మార్పుదలతో జరుపబడుచుండెను. అది కష్టముగదోచినందున, కొనదలచిన సరుకుల ఖరీదుకుగాను రూపాయీలు యివ్వబడి వ్యాపారము జరుపబడుచుండెను. పాపము! రూపాయీలను మోయుట సహితము భారముగదోచుట సంభవించినది. ప్రజలకు నానాటికి నాగరికత బలియుచున్నది. గావున ప్రభుత్వమువారు పరిస్థితులన్నిటిని బాగుగ గ్రహించి ప్రజలనుభవించు కష్టములను నివారణచేయుటకుగాను రూపాయీలకు బదులు కర్రెన్సీ నోట్లు (Currency notes) అను నామధేయముతో ప్రత్యేకకాగితములను ప్రభుత్వమువారి దస్కతు మోహర్లతో సృష్టిచేసి చలామణిలోబెట్టి వ్యవహారములను సాగింపనారంభించిరి. రు 5 లు మొదలు రు 1000 లు వరకు వివిధరకముల నోట్లు తయారుచేయబడి విరివిగ దేశమందంతటను వాడుకలో బెట్టబడినవి. కర్రెన్సీనోటు యనగా:—

సదరు కాగితములో నుదహరింపబడిన మొత్తమును, యాకాగితమును దెచ్చి యడిగిన వారికి యివ్వగలవాడను అని ఇండియాప్రభుత్వమువారి తరపున జవాబుదారి వుద్యోగస్థుడు వ్రాసి యిచ్చిన ప్రామిసరీనోటు. ఈ నోట్లు విషయమై యింతకన్న వివరించుటకు నవకాశము చాలదు.

ఈ నోట్లకు ననుగుణ్యముగ పోస్టుఆఫీసులలో (Insurance) భీమాచేసిన కవర్లద్వారా నోట్లు వగైరాలను రు 2000 లకు మించకుండా పంపుటకు సౌకర్యములు యేర్పాటు చేయబడెను. భీమా కమీషన్ ప్రస్తుతము నూటికి మూడు అణాలు అగుటచే మణియార్డరు కమీషన్ కంటె చాల యనుకూలముగ నుండుట సంభవించెను. కర్రెన్సీ నోట్లను కవరులో నుంచి మనసీలునువేసి, కవరులో నుంచబడిన మొత్తమును ననుగుణ్యముగ కమీషనును యిచ్చి భీమాచేసిన పక్షమున, పంపదలచిన వ్యక్తికి సదరు కవరు సురక్షితముగ చేరును. కర్రెన్సీ నోట్లనెగాక నితర విలువగల నేవస్తువునైయినను పై విధముగ బంపుటకు వీలగును.

రు 2000 లకు మించిన పైకమును బంపదలచిన యేమి చేయవలయును? భీమా (Insurance) పనికిరాదు. అప్పుడు బ్యాంకులమీదను, వర్తకులమీదను చెక్కులు, డ్రాఫ్టులు, హుండీలు వగైరాలను యిచ్చు పద్ధతి ప్రారంభింపబడెను. అందుమూలకముగ వేలకువేలురూపాయీలు బహుస్వల్పఖర్చుతో నొకప్రదేశమునుంచి మరియొకప్రదేశమునకు జేర్చబడుచున్నవి. వ్యాపారము విజృంభించి జరుగుటకు నవకాశము కలుగుచున్నది. గ్రంధబాహుళ్య భయముచే ఇంకను వివరింపజాలను. నాణెములు

గాని, కర్రెన్సీ నోట్లుగాని, చెక్కులుగాని, హుండీలుగాని, డ్రాఫ్టులుగాని విశేషముగ వాణిజ్య సౌకర్యమునకు నేర్పడినవి. మన హిందూదేశము వ్యవసాయ దేశము. మన ప్రభుత్వ మువారి యింగ్లాండు దేశము వాణిజ్యదేశము. పరస్పర సహాయమునకుగాను పై పద్ధతులన్నియు యనుష్ఠానింప బడుచున్నవి.

## —♦ ధన విలువ ♦—

వ్యవసాయదారులవద్ద నుండు ధాన్యము ధనమే. వర్తకులవద్ద నున్న వివిధవర్తక సరుకులు ధనమే. ఉద్యోగస్థులు-పాటకజనులవద్ద నున్న రూపాయిలు ధనమే. గాని ధాన్యము యొక్కగాని, సరుకులయొక్కగాని, రూపాయిలయొక్కగాని, విలువ యెప్పుడు స్థిరముగ నొకమాదిరిగనే యుండజాలదు. కాల పరిస్థితుల ననుసరించి మారుచుండును; తగ్గవచ్చును, లేక హెచ్చవచ్చును. వ్యవసాయదారులు సంవత్సరము పొడుగున యెండ—వాన, రాత్రి—పగలు, యనక ననేకవిధముల కష్టములను నోర్చి కృషిసల్పి ధాన్యమును పండించుచున్నారు. మన దేశములో ధాన్యము సమృద్ధిగనుండుటకు కారకులు వ్యవసాయదారులే. వ్యవసాయమే వారికి ముఖ్య జీవనాధారము. వర్తకులు వ్యవసాయదారులవద్ద వివిధసరుకులను గొని, లాభమునకు తదితరులకు నమ్మి జీవనోపాధిని గడుపుచున్నారు. పాటక జనులు, ఉద్యోగస్థులు, వారివారి వృత్తులను రోజుకూలి పద్ధతితోనో లేక నెలజీతముల పద్ధతితోనో సలుపుచూ, రూపాయిలను సంపాదించి, సదరు రూపాయిలతో గావలసిన భోజన సామగ్రిలు వగైరాలను గొని జీవనోపాధిని సలుపుచున్నా

రు. వ్యవసాయదారులు పండించిన ధాన్యముతోనే దేశము లోని తదితరులందరు జీవనమును జేయుట సంభవించుచున్నది. అనగా వ్యవసాయదారులవద్ద వారికి గావలసిన ధాన్యమును రూపాయీలతో కొని జీవనము చేయుచున్నారు అని యర్థము. రూపాయీ లుండినపక్షమున సమస్త పదార్థములు సంపాదింప బడవచ్చును. పదార్థములున్నపక్షమున రూపాయీలు సంపా దింపబడవచ్చును. గనుక రూపాయీలకు, నితర పదార్థములకు పరస్పర సంబంధము కల్గియున్నది. పదార్థములధర ప్రియమై నచో రూపాయీల విలువ తగ్గును. పదార్థములధర చవుక అయినచో రూపాయీల విలువ హెచ్చును. రూపాయి వక టికి యెనిమిదిమానికెల ధాన్యము రాగలదు అని యనుకొనుడు. అనగా యెనిమిదిమానికెల ధాన్యమును యిచ్చిన వకరూపాయి మనకు రాగలదు. అనగా రూపాయియొక్క విలువ యెనిమిది మానికెల ధాన్యమనుని యర్థము. అట్లే రూపాయి వకటికి నాల్గుమానికెల ధాన్యము రాగలదని యనుకొనుడు; అనగా నాల్గుమానికెల ధాన్యమునిచ్చిన వకరూపాయ మనకు రాగలదు. అనగా రూపాయియొక్క విలువ నాలుగు మానికెల ధాన్యము యని యర్థము. మొదటిసందర్భములో ధాన్యము చవుకగ నమ్మబడుచున్నది. రూపాయివిలువ ప్రియముగ నుండియున్నది. రెండవవిషయములో ధాన్యము ప్రియముగ నమ్మబడుచున్నది. రూపాయివిలువ చవుకగ నుండియున్నది.

వ్యవసాయదారులకు ముఖ్య జీవనోపాధి వారు పండిం చిన పంటధాన్యమె. సదరు ధాన్యము చవుకగ నమ్మబడినచో సంవత్సరము పొడుగున వారి జీవనము జరుగుటయె దుస్సాధ్య

మగును. గతసంవత్సరములో వారు సల్పిన కృషి యంతయు నిష్ఫలముగనే భావింపబడవలసివచ్చును. గాని యుద్యోగస్థులకు తదితరపాటకజనులకు మాత్రము లాభదాయకముగ నుండును. అదేవిధముగ ధాన్యపుధర ప్రియమైనచో, వ్యవసాయదారులకు ననుకూలముగనుండి జీవనోపాధిని సుఖముగ గడుపుటకు వీలగు చుండును. గాని యుద్యోగస్థులకు తదితర పాటకజనులకు ప్రాణ కంటకముగ నుండుట సంభవించును. ఇట్టి పరిస్థితులలో రూపాయీలు, యితర పదార్థములు పరస్పర విరోధభావముతో మెలంగుచున్నవి. కాలచక్రమహిమను దెలిసికొనుట నేరికి శక్యము ? ఏరులు—వాగులు—నదులు ఒక సంవత్సరమున నొక చోట దిబ్బబెట్టిన, మరుసటి సంవత్సరము సదరుదిబ్బను కోసి వేసి, మరియొకచోట దిబ్బను పెట్టునను విషయము మనకు ననుభవమువల్ల దెలిసిన విషయమేకదా. అట్లే లక్ష్మీసహితము నిలకడగ నొకచోట నుండజాలదు. పదార్థముల విలువలలో మార్పులే, నవాబుసాహెబును పకీరుసాహెబుగాను, పకీరుసాహెబును నవాబుసాహెబుగను జేయుటకు సమర్థత గలవి యగుచున్నవి.

వ్యవసాయ దేశములో వ్యవసాయదారులు సుఖముగ నుండినగాని, సదరు దేశమునకు క్షేమము కలుగజాలదు. ఒక ప్పుడు అనగా సహకార పరపతి సంఘముల చట్టము అమలులోనికి రాక పూర్వము, అనగా 1904 సంవత్సరమునకు పూర్వము, మనదేశప్రజలలో ముఖ్యముగ వ్యవసాయదారులు—శిల్పికారులు తినుటకు నన్నము కట్టుటకు బట్టలేకయు, విని కని యెరుగని క్షామములవల్ల, యంటుడు జాడ్యములవల్ల పీడింపబడుచూ,

యనేకవిధములైన యిడుములపాలగుచుండిరి. వ్యవసాయమును సాగించుటకు నింట్లో ఓపికగాని, వంట్లో ఓపికగాని లేకుండుట సంభవించెను. భూములన్నియు బంజరుగనుండుట సంభవించెను. జనుల మరణసంఖ్య దినదినాభివృద్ధిని బొందుచుండెను. మిగిలినవారుసహితము జీవచ్ఛవములలాగు తిరుగులాడుచుండిరి. అప్పుడు ప్రభుత్వమువారు దేశముయొక్క పరిస్థితులన్నిటిని సింహావలోకనము చేసి, వ్యవసాయదారులయొక్క స్థితిగతులను చక్కపరచినగాని ప్రయోజన ముండజాలదని నిశ్చయించుకొని, తదనుగుణ్యముగ వ్యవసాయదారుల యొక్కయు సిల్పికారులయొక్కయు సహాయార్థము సహకారపరపతిసంఘములను మన దేశములో స్థాపించుట ప్రారంభించిరి. ప్రస్తుతము దేశమందంతటను సహకారసంఘములు స్థాపింపబడి ప్రజలకు పలువిధముల సహకారులై దేశోద్ధారణకు జేయూత నొసంగుచున్నవి. గ్రామస్థులకు ముఖ్యముగ వ్యవసాయదారులకు జామీను పద్ధతితోను, స్థిరాస్తి తాకట్టుపద్ధతితోను విరివిగ ఋణము లివ్వబడుచున్నవి. వ్యవసాయదారుడు సల్పిన కృషికి విలువ బాగుగ నున్నంతవరకు, అనగా వ్యవసాయదారుడు పండించిన ధాన్యముయొక్క విలువ ప్రియముగ నున్నంతవరకు, సంఘబాకీలు క్రమముగ చెల్లింపబడుచూ, సంఘములు బహు జయప్రదముగ పనులను సాగించియున్నవి. ధాన్యపుధర తగ్గడముతోనే సంఘములు చిక్కులపాలగుటకు సిద్ధమగుచున్నవి. ప్రస్తుత దేశకాలపరిస్థితుల ననుసరించి, నవనాగరికత హెచ్చినకొలది, రహితుకు వ్యవసాయఖర్చులు హెచ్చగుచున్నవి; సర్కారుకు చెల్లించవలసిన కిస్తీలమొత్తము దినదినాభివృద్ధిని బొందుచున్నవి.

నిత్య సంసారపోషణకు గావలసిన ఖర్చు హెచ్చుచున్నది; వాటి నన్నిటి ననుసరించి పండించిన ధాన్యముయొక్క విలువ సహిత ము వుండియున్న పక్షమున, రైతు సార్లాపమునకు వీలగును. ధాన్యపుధర హెచ్చుగ నుండియున్న సంవత్సరములో అనగా 1930 సంవత్సరములో సంఘములలో నివ్వబడిన యప్పులను, నిరుడు-యీసంవత్సరము ధాన్యపుధర తగ్గినహేతువుచే తీర్చ జాలక రైతులు నానాయిడుముల పాలగుచున్నారు. గావున రైతుసోదరులారా! నవనాగరికత పద్ధతులననుసరించి దుబాబీ ఖర్చులను జేయకుడు. స్వయముగ కృషిసల్పిన, దేహమునకు గేహమునకు లాభము కల్గును. మనము చేయవలసిన పనులను మరియొకరికినియమించక, మనమేచేయుటమూలకముగ లాభము కల్గుటయేగాక యశస్సును బొందుటకు కారణమగును. ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో మితవ్యయమే మనకు సహకారియగును. మితవ్యయమే మనసంఘబాకీలను దీర్చుటకు మార్గదర్శియగును. మితవ్యయమే సహకారోద్యమము విషయమై ప్రస్తుతము సహ కార సోదరులు పడుయాందోళనమును శాంతపరుచుటకు దివ్య తంత్రము కాగలదు.

ఇంతవరకు ధనమును గురించియు, ధనముయొక్క విలు వనుగురించియు వివరించియుంటిని. అట్టి ధనము మానవులకు లభించుట యెట్లు? లభించిన దానిని కాపాడుకొనుట యెట్లు? కాపాడిన దానిని ఖర్చుపెట్టుట యెట్లు? యని విచారిం చెదము.

„అర్థానామార్జనే దుఃఖం, ఆర్జితానాంచ రక్షణే।
రక్షితానాం వ్యయె దుఃఖం, ధిగర్థం దుఃఖభాజనం॥”

ధనమును ఆర్జనచేయడము కష్టము, ఆర్జించినదానిని కాపాడడము కష్టము, కాపాడినదానిని ఖర్చుపెట్టడము కష్టము; కావున ధనసంబంధమైన విషయములన్నియు కష్టముతో సంబంధించినవిగాని సుఖమును గలుగజేయునవి కావని యొక విరాగి యొక్క మాటలు.

## మూ డ వ అ ధ్యా య ము

### —• కృష్యావశ్యకము •—

రెండవ యధ్యాయములో ధనమన యెట్టిది, దాని విలువ యెట్టిది వగైరాలను గురించి విపులముగ వ్రాయబడియున్నది. అట్టిధనమును యేవిధముగ సంపాదింప వచ్చునో విచారింతము. ధనమును కృషిమూలకముగ సంపాదింపవచ్చును. మానవుడుచేయు కృషియే ధనమును సంపాదించుటకు మూలబీజమగును. కృషినలుపని మానవుని జన్మ నిరుపయోగమని చెప్పబడవచ్చును. మన జన్మలో మనము ప్రతినిమిషమున ననుభవించు వస్తువులన్నియు కృషినుంచియే యుద్భవమగుచున్నవి. మనము నివసించు గృహములు—మనము పఠన చేయు గ్రంధములు—మనము వాడుకొను సామగ్రిలు—మన ముకట్టు బట్టలు—తుదకు మనము తిను భోజనపదార్థములు కృషి మూలకముగానే తయారుచేయబడుచున్నవి. మానవకోటి సౌఖ్యమునకు కృషియే రక్షణకర్తయైయున్నది. మానవులు ప్రపంచమునకు మహోపకారమైన కార్యములనుజేసి

దేశోద్ధారణను గావించుటకు కృషియే మూలకారణ మగుచున్నది. మానవులు యనుభవించు దారిద్ర్యమును పారదోలుటకు కృషియే వజ్రాయుధ మగుచున్నది. మానవులు వారి కుటుంబములతో సుఖముగ కాలక్షేపము జేయుటకు కృషియే మూలాధార మగుచున్నది. రాజులు చక్రవర్తులు, వారి రాష్ట్రములను సుఖముగ బాలించవలయు ననే యడల కృషియే ముఖ్యసాధనమగు చున్నది. మానవులు మానవసేవ దేశసేవలనుజేసి కృతార్థులగుటకు కృషియే మూలాధారమగుచున్నది. మానవులు స్వర్గసౌఖ్యములను మోక్షపదవిని బొందవలయునన్న, కృషిసలుపుటయే అనగా కర్మజేయుటయే ముఖ్యవిధాయకము. కృషిని సలుపకుండ జీవయాత్రను సలుపుట దుస్సాధ్యము. పూర్వీకులు చేసిన కృషి ఫలితములే మనవేదములు- పురాణములు-శాస్త్రములు వగైరాలన్నియు నైయున్నవి. మరియు మనము ప్రస్తుత మనుభవించు రైల్వేలు-టెలిగ్రాములు-స్టీమర్లు - ఫోటోగ్రాపులు - గ్రామఫోనులు-సినీమాలు వగైరా నవనాగరికమునకు సంబంధించిన పనులన్నియు గూడ నట్టివే. ఇట్టి పనులన్నియు, సృష్టిచేసిన వ్యక్తులకు శాశ్వతమైన కీర్తిని దెచ్చుటయేగాక, మానవకోటికి మహోపకారములను గావించుచున్నవి. మరియు యనేకమందికి జీవనోపాధిని గల్గించుచున్నవి. ఇట్టి సృష్టిచేసిన మహానుభావులు మరణించినను, వారులోకమునకు జేసిన ఉపకారమునుబట్టి మృతజీవులుగానే భావింపబడుచుందురు.

ప్రప్రథమమున మనపూర్వీకులు వుండుటకు నిల్లు, కట్టుటకు బట్ట, తినుటకు మంచి యాహారములేక యడవులలో

మృగములవలె దిరుగుచు, పచ్చిమాంసమును, దుంపలను, కాయలను దినుచు చెట్లపైన పండుకొనుచూ, మృగముల తోళ్లను కప్పుకొనుచూ కాలక్షేపమును చేసియుండిరి. వారి సంతతివారు సల్పు కృషిమూలకముగ, వారికి గావలసిన వివిధ పరికరములు మొదట రాతితో తయారు చేయబడుచుండెను. ఆకాలమునకు రాతియుగవు అని పేరుపెట్టబడెను. తదుపరి దినములు గడచినకొలది, కృషి హెచ్చినకొలది వివిధ పరికరములు లోహములతో జేయబడుచుండెను. ఆకాలములోహ యుగవు అని పిలువబడుచుండెను. అదేప్రకారము కాలము గడిచినకొలది, కృషిహెచ్చి మనదేశము మనమాతృస్థానమైన హిందూదేశము ప్రపంచమునకెల్ల నాగరికతకు కేంద్రస్థానమై పరదేశస్థులు వచ్చి, వివిధ వృత్తులను మనదేశస్తులవద్ద నేర్చుకొనుట సంభవించుచుండెను. అట్టిదేశమునకు భగవదనుగ్రహము క్రమముగ లేనికారణముచే ప్రస్తుతము స్థితిగతులు మారి దుర్భరదాస్యదారిద్ర్యంబులచే పీడింపబడుచున్నది. అయినను మనకెట్టికొరతయు లేకుండునట్లు వివిధ పరదేశములనుంచి వివిధపరికరములు మన యుపయోగము నిమిత్తం పంపబడుచున్నవి. మనవల్ల వాడబడుచున్నవి. అందువల్ల మనయార్థిక పరిస్థితులు నానాటికి క్షీణించుచున్నను, జీవయాత్రలు మాత్రము సలక్షణముగ జరుగుచున్నని.

ఏది యెట్లున్నను మనము ప్రతిదినము చూచి యనుభవించుచున్న యద్భుతములైన చిత్రవిచిత్రములన్నియు మానవులు సల్పు కృషిమూలకముగ దినదినాభివృద్ధిని బొందుచున్నవి. ఏపని యైనను ఒకరివల్లనే సంపూర్ణముగ చేయు

బడజాలదు. ఒకరివల్ల ప్రారంభింపబడిన పని వ్యక్తులు సల్పు కృషికి ననుగుణ్యముగ మార్పులు బొందుచూ యభివృద్ధిని బొందును. మనము ప్రస్తుతము చూచి ఆశ్చర్యపడు చిత్రములకంటె, మనసంతతివారు యెట్టియద్భుతమైన విచిత్రములను జూడగలరో కదా! ఇదియంతయు మానవులు సల్పు కృషి మీదనే యాధారపడియుండును.

మానవులు సల్పు కృషి ననుసరించియే, ప్రపంచములో విద్యయభివృద్ధిని బొందుచున్నది. ధనము విశేషముగ బెరుగుచున్నది. నవనాగరికత హెచ్చుచున్నది. మానవులకు సుఖము సకలవిధ సౌకర్యములు యమితమగుచున్నవి. అందువల్ల ప్రజలకు దయాస్వభావము—పరోపకారబుద్ధి ప్రబలుచున్నవి. అందువల్ల దేశము సుఖముగ నుండుటకు గారణమగుచున్నది.

దేశకంటకుడైన రావణాసురుడు పతివ్రతా శిరోమణియైన సీతామహాదేవిని దొంగిలించుకొని పోయినపుడు, భర్తయైన శ్రీరాముడు పలువిధముల కృషిసల్పి సముద్రమున సేతువును బంధించి, మహాయుద్ధమును గావించి, రావణ సంహారము చేసి, సీతామహాదేవిని తిర్గి పొంది దేశమునకు మహోపకారమును గావించెను. మరియు దుర్మార్గులు కుతంత్రులైన దుర్యోధనాదులు సన్మార్గప్రవర్తకులైన పంచపాండవులను రాజ్యభ్రష్టులను గావించి రాజ్యమునుంచి వెడలగొట్టిన పిదప, పాండవులు ధర్మమార్గమును వదలక కృషిసల్పి శ్రీకృష్ణులవారి సహాయముతో యుద్ధమున దుష్టసంహారమును గావించి, తిర్గి రాజ్యమునుబొంది దేశమునకు క్షేమమును గావించిరి. శ్రీ

రామకృష్ణులు శక్తి సంపన్నులై యుండియున్నను, కృషివల్ల నెట్టి యసాధ్యకార్యములయినను సానుకూలము కాగలవని మానవకోటికి నిదర్శనమును గన్పఱచుటకుగాను పలువిధముల కష్టములకు నోర్చుకొనుచూ, కృషిసల్పి తుదకు జయమును బొందియున్నారు. మఱియు మధ్యలో ననేకచిక్కులు వచ్చినను; అధైర్యపడరాదని సహితము బోధపరచుచున్నారు.

స్వర్గలోకమున బ్రవహించు గంగానదిని భూలోకము నకు దెచ్చుటకు భగీరథుడు సల్పిన కృషి సర్వజన విదితంబె గదా. ఇప్పటికిని ఉత్తర హిందూస్థానములో ప్రవహించు గంగామహానది 'భాగీరథి' యనిగూడ పిలువబడు చుండును. మఱియు నెవరైనను నేపనికైనను విశేషముగ కష్టపడి ప్రయత్నములను సలుపుచుండిన పక్షమున అట్టి ప్రయత్నములు 'భగీరథ ప్రయత్నములు' అని చెప్పబడుచుండును.

కృషి—కర్మ, దాదాపు పర్యాయపదములె. "మానవులు వారి వారి విధ్యుక్త కర్మలను చేసి తీరవలెయును. అట్లు చేయనిది మోక్షమును బొందుటకు నర్హులుకాజాలరు" మరియు "కర్మణ్యేవాధి కారస్తెమాఫలేషు కదాచన" అనగా" కర్మను జేయుట మాత్రము నీపని యైయున్నది. నీవు చేసిన కర్మకు ఫలమును యిచ్చుట భగవదాధీనము యైయున్నది," అని శ్రీభగవద్గీతలలో శ్రీకృష్ణభగవానులు చెప్పి యున్నారు. గావున నెటుజూచినను మానవులు కృషిని సల్పుటయే విధాయకముగ గనబడుచున్నది మన పురాణగ్రంధముల ననుసరించిగాని, మనపూర్వదేశపు చరిత్రల ననుసరించిగాని, మానవులు యభివృద్ధిని గాంచుటకు కృషియే శరణ్యము అని స్పష్ట

ముగ విదితమగుచున్నది.

ఒక ఆంగ్లేయయార్థికశాస్త్రజ్ఞుడు తన చిరకాలానుభవముతో యీదిగువ సూత్రములను యేర్పర్చి ప్రజాసామాన్యపుపయోగమునకు పెద్ద యక్షరములతో నచ్చువేయించి ప్రచురపరచియుండెను.

(1) ఎన్నడు నధైర్యపడవద్దు. నిరాశను బొందవద్దు.

(2) కృషిచేయనిది యేమియు లభింపజాలదు.

(3) సంపాదించినదానిలో నేమియు మిగల్చక ఖర్చుపెట్టువాడు తుదకు ముష్టి యెత్తుకొనవలసియుండును.

(4) గడిచినకాలము తిర్గిరాదు.

(5) కృషిసల్పుటను—తాగుడు మొదలగు దుర్వ్యసనముల నభ్యసించక బోవుటను—పొదుపుగవాడుకొనుటను, ప్రతిదినము నాచరణలో నుంచుము.

దిగువ విషయములను సంపూర్ణముగ ననుష్ఠానమందుంచినగాని, కృషి క్రమమార్గమున నలుపబడు చున్నదని నుడువుటకు వీలుపడదు. ప్రస్తుతము ధనమార్జనను గురించి వ్రాయబడుచున్నది గనుక, ధనమార్జనకు సంబంధించిన కృషిని గురించియే విచారింతము.

## —♦ కృషిని సలుపవలసిన విధములు ♦—

(1) ధనమార్జనకు గావలసిన మానవ విధాయక ధర్మములను గురించి బాగుగ దెలిసికొనుట,

(2) పై ధర్మముల నాచరింపవలసిన పద్ధతులను నిర్ణయించుట,

(3) దురభ్యాసములులేక సత్ప్రవర్తనగలవాడై యుండుట.

యీ మూఁటినిగురించి వరుసగను వివరముగను వ్రాయ బడును.

(1) ధనమార్జనకు గావలసిన మానవ విధాయక ధర్మము లను గురించి ముందుగ విచారింతము.

సదరు ధర్మములు యేవియనగా:—

(i) ఆత్మగౌరవమును కాపాడుకొనుచూ కృషినిసల్పుట,

(ii) తనమీద నాధారపడియున్న వారిని తగువిధముల బోషించుట.

(iii) కష్టదినములలో తన వుపయోగమునిమిత్తం, తన తరువాత మిగిలిన తన వారి వుపయోగము నిమిత్తం తగు నేర్పాటులను గావించుట.

(iv) గ్రంథపఠనమువల్ల మనోవిజ్ఞానమును యభివృద్ధిని బొందించుకొనుచు, దేశభక్తి దైవభక్తి కలవాడై సాధ్యమై నంతవరకు ప్రజల కష్టములకు దోడ్పడుచూ మానవసేవ జేయ బూనుకొనుట.

(v) అత్యాశకు లోనుగాక, ధనమార్జనకు నీచమార్గ ములను దొక్కక, కష్టపడి చమటోడ్చి సంపాదించిన దానితో పరమసంతుష్టిని బొందుట.

(1) (i) ఆత్మగౌరవమును కాపాడుకొనుచూ కృషినిసల్పుట.

మానవులు యాస్తిపరులైనను యాస్తిపరులు కాకపో యినను, జీవయాత్రను సలుపుటకు కృషిని సలిపియే తీరవల యును. ధనవంతులు తమకున్న ధనమును వాడుకొనుచూ, వృద్ధి జేయుటకు కృషి సలుపని పక్షమున నెన్నిదినములు సుఖముగ జీవింపగలరు? ధనమున్నంతవరకు సుఖముగ జరుగును. తమ

వరి వారి గతియేమి? సామాన్యజనులవలె కృషిసలుపుటయే వారిగతియగును. గాన యట్టి యగౌరవపదవిని పొందకుండా కాలక్షేపమును జేయుట్లకుగాను, ధనవంతులు సహితము వారి ధనమును యభివృద్ధిని బొందించుటకు కృషిని సలుపుచూ, అట్లుజేయుటవల్ల కలిగిన లాభముతో దినయాత్రను సలుపుట విధాయకమైయున్నది. ధనవంతులు వారి వద్దనున్న ధనమొత్తము ననుసరించి వారికి లాభదాయకమైనట్టి పనులను జేయుటకు నుద్యమింతురు. అట్టిపనులు కొన్ని సమయములలో విశేష ధనహీనులకు సహితము జీవనోపాధిని కల్గించుటకుగూడ దోడ్పడగలవు. ధనవంతులు చేయుపనుల మూలకముగ వారు లాభమును బొందుటయేగాక, ధనహీనులైన మానవులకు సహితము జీవనోపాధిని గల్గించి, సుఖముగ కాలక్షేపమును జేయుటకు నావకాశము కలుగజేయుచున్నారు.

ధనహీనులు, విద్యావాసనను కల్గియుండిన పక్షమున, తదనుగుణ్యముగ నుద్యోగమును సంపాదించి జీవయాత్రను సలుపును. విద్యావాసనలేని ధనహీనులు కూలినాలి చేసుకొనిగాని, లేక యెవరివద్దనైనను నెలజీతమువిూద నవుకరీకి నుండిగాని కృషిసల్పుచూ, జీవయాత్రను గడుపవలసి యుండును. కృషిసలిపినగాని, ధనవంతులకు ధనహీనులకు జీవయాత్ర సుఖముగ సాగజాలదు.

## —♦ సద్వ్యాపారములు : దుర్వ్యాపారములు ♦—

భగవంతుడు మానవులకు సంపూర్ణమైనట్టియు, దోషరాహిత్యమైనట్టియు సకల యవయవములతోను, నిర్మలమైన

బుద్ధి మనోజ్ఞానములతోను మంచి దారుఢ్యము, మంచి యారో గ్యముగల దేహమును కటాక్షించినది, దేహముతో కృషిసల్పి సత్కార్యాచరణమందే మనస్సును నిల్పి యిహపర సౌఖ్యము లను బొందుటకుగాని వేరుకాదు. అట్లుగావించక దేహమును దుర్వ్యాపారములలో బ్రవేశపెట్టిన పక్షమున భగవదాగ్రహము నకు బాత్రుడుకావలసి వచ్చును. సద్వ్యాపారములుగాని దుర్వ్యాపారములుగాని కృషిసలుపక నెరవేరజాలవు. రెంటికిని కృషి యావశ్యకమే. కాని సద్వ్యాపారములు, చేసినవారికిని తదితరులకును మంచిని కలుగజేసి సుఖముగ గాలక్షేప మునుజేయుటకు దోడ్పడును. దుర్వ్యాపారములన్ననో, చేసిన వారికిని, తదితర సంబంధీకులకును జెడును కలుగజేయుచూ, నానాయిడుముల పాలగుటకు దోడ్పడును. చెడు మంచి కంటె వెయ్యిమడుగల నధికముగ వృద్ధిని బొందుచుండును. చెడు యలవడునంత సులభముగ మంచి యలవడుట నసా ధ్యము. ఎట్టివారినైనను సాధ్యపరచుకొనుటలో చెడుకుగల శక్తి మంచికిలేదు. ప్రస్తుతము విశేషముగ ప్రజలు చెడు యొక్క వలలలో జిక్కి, దానికి స్వాధీనులై నానావిధదుష్కా ర్యముల నాచరించుచున్నారు.

చెడుగు లేక దుర్మార్గమే దేశములందంతటను వ్యా పించియున్నది. కొద్దిమంది తప్పితే, మిగతా వారందరు దుర్మార్గమునకు స్వాధీనులై భృత్యాను భృత్యులగుచూ పర మనీచ దుర్మార్గకార్యముల నాచరించుచూ వారు చెడుటయే గాక లోకమునకు సహితము దుర్భరమైన కీడును కలిగించుచూ మహా సంక్షోభమును గావించు చున్నారు 'Knowledge

is power' అనగా జ్ఞానము బలవంతమైనది యని చెప్పబడు చున్నది. కాని, లోకానుభవము వల్ల మాత్రము 'Ignorance is power' అనగా నజ్ఞానమె బలవంతమైనది యని నుడువవలసి వచ్చుచున్నది. ప్రతి దేశములోను, అజ్ఞానము ననుసరించి దుర్మార్గము ప్రబలిన హేతువుచేతనే ప్రభుత్వమువారు విశేషద్రవ్యమును వ్యయపరచుచూ, దుర్మార్గమును నశింపజేయుటకు తగు సంస్థలను స్థాపించియున్నారు. దుర్మార్గత ప్రబలియున్నచోట ప్రజలకు మనశ్శాంతి యుండజాలదు. ప్రభుత్వమువారికి సహితము మనఃస్వస్థత యుండజాలదు. కావుననే ప్రభుత్వమువారు దుర్మార్గతను నాశనము జేయుటకుగాను, పోలీసుఉద్యోగస్థులను, జెయిళ్లను, కోర్టులను స్థాపించి కృషిసలుపుచున్నారు. ఇట్టి సందర్భములలో ప్రభుత్వమువారు విశేషధనమును వ్యయపరచుచూ రాజ్యపరిపాలనను గావించుచున్నారని నుడువుటవలన సదరు దేశములో దుర్మార్గములేక యజ్ఞానమె బలవత్తరమై ప్రబలియున్నదని చెప్పవలసియుండును. ప్రభుత్వమువారు సలుపు కృషి మూలకముగ దేశములో దుర్మార్గత తగ్గి ప్రజలు సుఖముగ కాలక్షేపము జేయుచున్నారా యని విచారింతము. దుర్మార్గత తలయెత్తినచోట నెల్లను, అణగగొట్టుచున్నమాట వాస్తవమే. అయినను నానాటికి దేశములలో దుర్మార్గత హెచ్చి, నవనాగరికత సిద్ధాంతములతో అఘోరమైన దుర్మార్గ కార్యములు చేయబడుచూ, ప్రజల మనస్సులను క్షోభిల్ల జేయుచున్నవి. కేసులసంఖ్యయు, పోలీసు ఉద్యోగస్థులసంఖ్యయుకోర్టుల సంఖ్యయు, దినదినాభివృద్ధిని బొందుచున్నవిగాని దుర్మార్గము

తగ్గుముఖము పట్టినట్లు సూచనలైనను గోచరమగుట లేదు. దుర్మార్గత ఒక మితకాలములో నిర్మూలింపబడుటకు ననుకూలమైన విషయము కాదు. ప్రతి మానవునికి సన్మార్గ, దుర్మార్గములు రెండును ఆశ్రయించియే యుండును. సన్మార్గము హెచ్చుగనున్న వానిని సన్మార్గుడు అని పిలుచుట కలదు. దుర్మార్గము హెచ్చుగనున్నవానిని దుర్మార్గుడు అని పిలుచుటకలదు. దుర్మార్గము హెచ్చి, సన్మార్గమునకు తావుదొరకనపుడు, భగవంతుడు యవతారము నెత్తి, దుర్మార్గమును నశింప జేసి, ప్రజలకు సుఖమును కలుగజేయుచున్నాడు.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥" అనగా సన్మార్గులను రక్షించుటకును, దుర్మార్గులను నాశనము జేయుటకును, ప్రపంచకమున ధర్మమును స్థాపించుటకును, నేను ప్రతియుగమున అవతరించుచున్నాను, అని శ్రీకృష్ణభగవానులు శ్రీభగవద్గీతలలో నుదహరించి యున్నారు. ఈ విషయము మన పురాణములను బట్టి, మన కందరకును దెలిసియేయున్నది. గావున దుర్మార్గము సంపూర్ణముగ పెరిగినగాని, విరుగుటకు వీలుండదు.

## సత్సహవాసము

ప్రభుత్వమువారు సలుపు పై ప్రయత్నములుకాక, దుర్మార్గమును భేదించుటకు వేరుమార్గము లెవ్వి అయినను కలవాయని విచారింతము. విద్య కొంతవరకు దోడ్పడ వచ్చునని మహాజనాభిప్రాయ మైయున్నది. ప్రజలలో విద్యాభివృద్ధి అయినకొలది, దుర్మార్గము నశించి, సన్మార్గము

యభివృద్ధిని బొందుటకు సావకాశము కల్గును. ప్రాతఃకాల మున సూర్యోదయము కావడముతోనే, రాత్రియంతయు యావరించియున్న యంధకారమంతయు నశించిపోవునట్లు ప్రజల మనస్సులలో విద్యయను సూర్యోదయము కావడముతోనే, అవిద్య లేక అజ్ఞానము లేక దుర్మార్గతయను యంధకారము నశింపచేయబడును. అందువల్ల దుర్మార్గమునకు సంబంధిం చిన దుర్గుణములన్నియు నశించి, సన్మార్గుడై లోకోపకారియ గుట సంభవించును. విద్యా వ్యాపకమునకు గాను ప్రభుత్వ మువారు సహితము కొంత ద్రవ్యమును ప్రతిసంవత్సరము వ్యయపరచుచున్నారు. చదువుకున్నవారి సంఖ్య ప్రతిసంవత్సర ము హెచ్చుచున్నను, దుర్మార్గము హెచ్చుట మాత్రము తగ్గలేదు. భగవదాజ్ఞ. విద్యయనునది చదువుట వ్రాయుట మాత్రమేకాదు. లోకవ్యవహారజ్ఞానమును దెలిసికొనుట, మతసంబంధమైన నీతిసంబంధమైన జ్ఞానమును గల్గియుండుట కూడ విద్యయని చెప్పబడును.

సత్సాంగత్యమువల్ల నిట్టి విద్యకు సంబంధించిన విష యములు అనేకములు తెలియుటకు నవకాశము కల్గుచున్నది. సత్సాంగత్యము అనగా సజ్జనులు అనగా సత్ప్రవర్తనగలవా రితో సహవాసము. దుస్సాంగత్యము అనగా దుర్జనులు అనగా దుష్ప్రవర్తన కలవారితో సహవాసము. "ఆరునెలలు సహవాసము చేసిన, వారు వీరగుదురు" అను లోకోక్తి నను సరించి సత్ప్రవర్తన గలవారితో సహవాసము జేసిన, సత్ప్రవ ర్తనకు ననుగుణ్యమగు గుణములబ్బును. దుష్ప్రవర్తనగల వారితో సహవాసము జేసిన, దుష్ప్రవర్తనకు ననుగుణ్యమగు

లక్షణము లబ్బును.

"త్రిజగతి సజ్జనసంగతిరేకా భవతి భవార్ణవతరణేనౌకా॥

అనగా మూడులోకములలోను సంసార సాగరమును దాటుటకు సజ్జనసహవాసమే పరమోత్తమమైన నావయగు చున్నది యని శ్రీశంకరాచార్యులువారు వారి భజగోవింద శ్లోకములలో నుదహరించి యున్నారు. పాఠశాలలోని విద్యార్థులుచేయు సహవాసము ననుసరించి, సన్మార్గదుర్మార్గ గుణము లబ్బుచుండును. తదుపరి క్లబ్బులలోను, తదితర సంఘముల లోను మెలగువారికి అచ్చోట వారుచేయు సహవాసానుగుణ్యముగ సద్గుణదుర్గుణము లబ్బుచుండును. ముఖ్యముగ పాఠశాలలలో విద్యార్థులుగ నుండినపుడు సహవాసమువల్ల నబ్బు గుణములే, వారు పెద్దవారయి సంసారభారమును వహించు నపుడు సహాకార ప్రతీకారు లగుచుండును. గావున మానవులు పాటుబడి సత్సహవాసము సంపాదించిన పక్షమున, వారి జన్మ సార్థకమగుటకు కారణ మగును. దురభ్యాసములకులోనై యధోగతిపాలుగానున్న వారికి సత్సహవాసమే చేయూతనొసగి వుద్ధరించుటకు గారణమగును. యజ్ఞానాంధకారమున బడి మంచిచెడ్డలు తెలియక దారితెన్నుగానని మానవులకు సత్సహవాసమే జ్ఞానోదయమును గల్గించి రక్షించుటకు గారణమగును. ప్రతిమానవునికి నిహాపరసౌఖ్యముల నిచ్చుటకు సత్సహవాసమే కారణమగును. పరమసద్గురువుగ భావింపబడి సద్గురువువల్ల కలుగు లాభములన్నిటిని బొందుటకు సత్సహవాసమే కారణమగును. ఇంతటితో సత్సహవాసమును గురించి గ్రంథబాహుళ్య భయముచే ముగించెదను.

## —♦ ఆత్మ గౌరవము ♦—

మానవులు సత్ప్రవర్తన కలవారై సద్వ్యాపారముల ను చేయ బూనుకొనుట విధాయకమై యున్నది. వారు వారి స్థితిగతులను బట్టియు, వారి జీవితాశయములనుబట్టియు, వారి వృత్తులను స్థిరపరచుకొనవలయును. వంశపారంపర్యముగ వచ్చు వృత్తులను సామాన్యముగ విడువరాదు. వ్యవసాయ ము—వర్తకము—వుద్యోగము—కూలిపని ప్రస్తుతము మనదేశము లో ముఖ్యవృత్తులు అయియున్నవి. వాటిలో వ్యవసాయము వర్తకము బహుజనమువల్ల బహు బాహుళ్యముగ నాచరింప బడు వృత్తులు అయియున్నవి. విద్యావంతులకు వుద్యోగము ప్రధానవృత్తి అయియున్నది. విద్యావిహీనులకు, విద్యావా సన విశేషముగ లేనివారికి కూలీపని జీవనోపాయమును గల్గించు ముఖ్యవృత్తి అయియున్నది. మనదేశములో యీ నాలుగు వృత్తులు పరస్పరసంబంధముకలవి యగుచూ దేశక్షేమమునకు మూలకారణము లగుచున్నవి. పై వృత్తులవారు ప్రారంభమున నెట్టి హీనదశయం దుండియున్నను, వారువారు సల్పు కృషికి ననుగుణ్యముగ మహదైశ్వర్యవంతు లగుట సంభవించి మాన వకోటికి పలువిధముల నుపకారములను గావించి, లోకప్రఖ్యా తిని బొందుచున్నారు. ఏవృత్తి నయినను పాలుమాలక శ్రద్ధ వహించి వాటి నియామకముల ప్రకారము నాచరించినపక్షమున అట్టి వృత్తివల్లనే మానవులు విశేషలాభమును బొందగలరు. అట్టి దృష్టాంతములను మనము అనేకము చూచుచున్నాము. మిల్లులో కూలీగ ప్రవేశించి, మిల్లుల యజమానులగుచున్నారు.

వర్తకులవద్ద గుమాస్తాలుగా ప్రవేశించి, మహదైశ్వర్యవంతులై స్వంతముగ వర్తకమును జరుపుచున్నారు. కచేరీలలో attendar గ ప్రవేశించి మహోన్నతపదవులను బొందుచున్నారు. యేవృత్తి నయినను సత్ప్రవర్తనగలవారై, యేవిధమైన మోసకృత్యము లనుగాని, దుర్మార్గ కార్యములనుగాని గావించక చేయుచుండిన పక్షమున, మర్యాదస్థుడు అను పేరును సంపాదించుటయే గాక మన గౌరవమును మనము కాపాడుకొనుటకు వీలగును. మన మెట్టి స్వల్పమైన దుర్మార్గకార్యమును జేసినను, మనగౌరవము పోవుటయేగాక, మనము యపఖ్యాతిపాలగుట సంభవించును. పరపతిని గాపాడుకొనుటకు మన మెట్లు తిప్పలు పడుచున్నా మో, అదేవిధముగ మన గౌరవమును కాపాడుకొనుటకు సహి తము మనము పాటుపడవలసి యుండును. ప్రతి మానవునికి వాని జన్మరీత్యా యాత్మగౌరవము కలదు. కూలీ యతని పనిని యనుకున్నప్రకారము యతను చేసిన పక్షమున, యతని గౌరవము యతనికే నిలుచుటయేగాక, యతని గౌరవభంగ మును జేయుటకు నితరులకు సహితము యవకాశ ముండజా లదు. అట్లే యేవృత్తియందైనను మానవులు వారి విధా యక కృత్యములను యధావిధిగ నాచరించుచుండిన పక్ష మున, వారి యాత్మగౌరవము నిలుచుటయేగాక, నితరులు యేవిధముగ వారిని దూషించుటకు నవకాశ ముండజాలదు. గావున మానవులు వారు యేర్పర్చుకున్న హీనవృత్తులనుసహి తము క్రమప్రకారము నాచరించుచుండిన పక్షమున, వారు చేయు పనులు జయప్రదమగుటయే గాక, వారి యాత్మగౌర వము దినదినాభివృద్ధిని బొందుచుండును. వృత్తులన్నియు పర

స్వర యవసరము గలవియు, లాభదాయకములైనవి అయి యున్నవి. అట్టి వుపయోగకర్రమైనట్టియు, లాభదాయక మైనట్టియు వృత్తి హీనము యెట్లుకాగలదు? వృత్తిని సల్పు వారి గౌరవాగౌరవములను బట్టి సదరు వృత్తికి సహితము ఘనత్వము నీచత్వము కల్గుచున్నది. గనుక, మనము మన యాత్మగౌరవమును కాపాడుకొనుచుండిన పక్షమున మనము చేయు పనులకు సహితము గౌరవము కల్గును; పనులు లాభ దాయకమగును; మనము సుఖముగ జీవనమును జరుపుటకు నవకాశము కల్గును.

గనుక మానవులు సత్ప్రవర్తన కలవారై, యాత్మగౌరవమును కాపాడుకొనుచూ సద్వ్యాపారములను చేయబూను కొనుట, ధనమార్జనకు గావలసిన విధాయక ధర్మములలో ముఖ్య మైనది. అట్టి మానవులకు సహకారోద్యమములో సహితము అగ్రస్థానము చేకూరగలదు. సహకారోద్యమమునకు నిట్టి వారే ముఖ్యముగ కావలసియున్నారు. అట్టివారు విశేష సంఖ్యాకులు వుద్యమములో లేమిని సహకారులు గ్రహించి చింతిల్లుచున్నారు. ఉద్యమము సహితము తగినంతగ ప్రబలుట లేదు. సహకారశాఖను ప్రభుత్వమువారు ప్రజాయత్తము చేసి సంబంధమును విశేషముగ వదలుకొనవలయునని ప్రారంభమున సంకల్పించియుండిరి. కాని ప్రస్తుత వుద్యమ పరిస్థితుల ననుసరించి, సహకారచట్టములో మార్పులు గావించబడినపుడు, ప్రభుత్వశాఖ వుద్యోగియులకు పూర్వముకంటె విశేషయధికారములు యివ్వబడియున్నవి. ఇది మన స్వాపరాధమే.

(ii) తనమీద నాధారపడి యున్నవారిని దగువిధముల

బోషించుట.

మానవునికి, తాను చేసుకున్న భార్య, భగవంతు డను గ్రహించిన పిల్లలు, వృద్ధులగు తల్లిదండ్రులు, తదితర యాత్మ బంధువులు ముఖ్యపోషకవర్గము అయియున్నది. రెండు చక్రములు లేనిది బండి యేల క్రమముగా బనిజేయ జాలదో, రెండు రెక్కలు లేనిది పక్షి యాకసమున యేలయెగురజాలదో అదేవిధముగ స్త్రీ పురుషులు యిద్దరు లేనిది సంసారము క్రమముగ నడుపబడజాలదు. ధనమార్జన పురుషులపనియు, గృహ కృత్యములను జరుపుట స్త్రీలపనియు అయి యున్నది. స్త్రీలు సంసారములో సగము భారమును వహించి పురుషులకు దోడ్ప డుచుందురు. మానవులకు బాల్యదశ, యౌవనదశ, వృద్ధదశ యని మూడు ముఖ్యదశలు వుండియున్నవి. మానవులు వారి బాల్యదశయందు తల్లిదండ్రులవల్ల రక్షింపబడుచుందురు; వారి యౌవనదశయందు, ధనమార్జనను శక్తివంచన లేకుండగ జేయుచూ, వారిమీద నాధారపడియున్నవారి నందరిని తగు విధముల నాదరించుచూ, క్రమముగ వారిని రక్షించుట విధాయకమై యున్నది. వృద్ధదశయందు వృద్ధాప్యముచే నశక్తులై నందున వారి బిడ్డలచే రక్షింపబడుచుండుట విధాయ కము అయి యున్నది. బాల్యదశలో తల్లిదండ్రుల సంరక్ష ణలోనుండి నేర్చుకొనిన సుగుణదుర్గుణములే, యౌవనదశ యందు వారికి సహకార ప్రతీకారములగుచుండును. తండ్రి సత్ప్రవర్తనకలవాడై, నిష్కర్ష మనిషి అయినపక్షమున, సదరు గుణములే కుమారులకు సహితము యబ్బుట సహజము. అట్లుగాక తండ్రి దుర్మార్గలోలుడై దుర్వ్యాపారచిత్తుడై కాల

మును గడుపుచుండిన పక్షమున, కుమారులు సహితము ఆత్రో వలనే త్రొక్కుచూ, తండ్రిని పలువిధములమించుటకు ప్రియత్నములను సలుపుట విధాయకమని కృషి సలుపుదురు. హిరణ్యకశ్యపునికి ప్రహ్లాదుడు పుట్టలేదా యనునట్టి వుదాహరణములు వుండవచ్చును. కాని యట్టివి బహు యరుదు. బాల్యదశయందు పిల్లలు బహుభయభక్తులతోను సత్ప్రవర్తనతోను మెలంగునట్లు చూచుచుండినగాని, వారు బాగుపడుటకు నవకాశముండజాలదు. తల్లిదండ్రుల నశ్రద్ధమూలకముగ చాలమంది పిల్లలు తప్పుడుత్రోవలను త్రొక్క చెడుటకు కారణమగుచున్నది.

పిల్లలను మంచిత్రోవను బెట్టుటలో దండ్రికి నున్న జవాబుదారీకంటె తల్లికి నెక్కుడు జవాబుదారీయుండి యున్నది. పిల్లలను తల్లి చిన్నప్పటినుంచియు పోషణచేయుచూ, వారిని పలువిధముల కనిపెట్టుచుండును. తల్లి యింట్లోనే యవసర కృత్యములను జరుపుచూ వుండును గనుక, పిల్లలు విశేషకాలము తల్లిని యాశ్రయించుకొని వుండుట సహజము. కావున తల్లి పిల్లలయడల కనపర్చు శ్రద్ధనుబట్టియే పిల్లల భవిష్యజ్జీవితము యేర్పడగలదు. తల్లికి తీరుబడి సమయములలో, మాటలను గ్రహించుకొన శక్తిగల పిల్లలకు, నీతి సంబంధమైనట్టియు, చారిత్రిక సంబంధమైనట్టియు, మతసంబంధమైనట్టియు వివిధ విషయములను, మరియు శూరులయొక్కయు, మతస్థాపకుల యొక్కయు, నీతిపరుల యొక్కయు, దేశభక్తుల యొక్కయు జీవితములను, చిన్నకథల రూపకముగ పిల్లల మనస్సుల నాటునట్లు మృదుమధుర భాషణములతో బుజ్జగించి

చెప్పుచూ, పిల్లల నుత్సాహపరచుచూ క్రమమార్గముల నడుచు నటుల చూచుచుండుట తల్లి విధాయకము. మరియు దుర్మార్గ ప్రవర్తనవల్ల కలుగు నష్టములను గురించి చిన్న చిన్న వుదాహరణములతో పిల్లలకు బాగుగ బోధపడునట్లు వుపదేశించుచుండవలయును. తండ్రికంటె తల్లికే పిల్లలను బాగుపరచుటకు నెక్కువయువకాశములు, సమర్థత యుండును. ప్రస్తుతము పిల్లలే, ముందు తల్లిదండ్రులు కాగలరు; సంసారభారమును వహింపవలసినవారగుదురు; దేశమునకు సంబంధించిన కష్టసుఖములను యనుభవింపవలసిన వారగుదురు; యను మాటలను మనస్సునందుంచుకొని తల్లిదండ్రులు బహు జాగరూకతతో పిల్లలను పెంచుచుండవలయును. తల్లిదండ్రులు శక్తి వంచనలేకుండా తగు విధముల పాఠశాలలలో విద్యను నేర్చుకొనునటుల చేయవలయును. వృద్ధుల సేవవిషయము సహితము నిర్లక్ష్యము చేయక పాటుపడుచుండవలయును. మాతాపితృలసేవ సర్వ విధముల మోక్షదాయకము. గావున వారికెట్టి లోపము లేకుండునటుల బహు పదిలముగ వారిని కాపాడుచుండుట పుత్రుల విధాయకము.

(iii) కష్టదినములలో తన వుపయోగము నిమిత్తం, తన తరువాత మిగిలిన వారి వుపయోగము నిమిత్తము తగు యేర్పాటులను గావించుట.

ఆత్మగౌరవమును కాపాడుకొనుచూ, తనమీద నాధారపడి యుండిన పిల్లలను, భార్యను, వృద్ధులను గాపాడుటకు కృషిసల్పుచూ ద్రవ్యసంపాదనను గావించు చుండిన పక్షమున, మానవుని జన్మసార్థకమగునా? అంతమాత్రముతో కాజాలదు.

దేహములు అస్థిరములు, వ్యాధిగ్రస్తములు; పైతృణము మన దికాదు. ప్రస్తుతము మనము మంచి యారోగ్యముగను మంచి దారుఢ్యముగను వుండియున్నను, పై నిమిషములో నేమి ముప్పువాటిల్లునో, యేమివ్యాధి సంభవించునో, యేరికిని దెలి యవశముకాదు. గనుక మనముచేయు ప్రతిపనియును వుత్తర క్షణ యాలోచనతో జేయుచుండవలయును. మానవులు యౌవనదశలో నారోగ్యముగనుండి కృషిసల్పుదినములలో, యేరోజు సంపాదించిన దానిని యారోజునసే ఖర్చుపెట్టక, మితముగ వాడుకొనుచూ కొంత ద్రవ్యమును నిలువచేసిన పక్షమున అట్టి ద్రవ్యము వారికిని, వారిమీాద నాధార పడియున్న వారికిని చాల విధముల సహకారియగుట సం భవించును. కుటుంబములో సంపాదనజేయు పురుషుడు బాగుగ నున్నంతవరకు క్రిందు మీాదు దెలియకుండగ ద్రవ్యమును వ్యయపరచుచూ, ముందాలోచన యేమియు లేకుం డగ కాలక్షేపమును జేసిన పరిస్థితులలో, సంపాదనచేయు పురు షుడు అశక్తుడయిన పక్షమునగాని, యంతరించిన దర్మిలాను గాని, మిగిలినవారిగతి యేమగునాయని ముందాలోచన జేయుట సంభవించిన పక్షమున, అగమ్యగోచరముగనుండి, యేవైపున జూచినను దారితెన్నును గానక మహాసముద్రములో నోలలాడు చుండుట సంభవించును. కావుననే చాలమంది యార్థికశాస్త్ర పరిజ్ఞానము కలవారు వారి సంపాదన ద్రవ్యము లో కొంతభాగమును బ్యాంకులలో డిపాజిట్లు మూలకముగ గాని, మంచి యాదాయమురాగల స్థిరచరాస్తులను కొనుట మూలకముగగాని, ప్రాణములను భీమాచేయుట మూలకము

గగాని, దాచుచున్నారు. అట్టి ద్రవ్యము సంసారములో సంభవించు శుభాశుభములకుగాని, వ్యాధులకుగాని, యవసరము కల్గినప్పుడు దానము మూలముగ పరోపకారమును జేయుటకుగాని, యింతచెప్పనేల, యిహాపర సౌఖ్యములను బొందుటకు ననుకూలించుచుండును. గావున మానవులు తమ సౌకర్యమునకుగాను, తమ యాత్మబంధువుల సౌకర్యమునకుగాను, సంపాదన ద్రవ్యములో కొంత భాగమును నిలువచేసి దాచుట విధాయకము అయియున్నది. అట్లు గావించని యెడల తాము,బంధువులు పలువిధముల జిక్కులుపడుట సంభవించును.

(iv) గ్రంథపఠనమువల్ల మనోవిజ్ఞానమును యభివృద్ధిని బొందించుకొనుచూ, దేశభక్తి, దైవభక్తి గలవారై సాధ్యమైనంతవరకు ప్రజల కష్టములకు దోడ్పడుచూ మానవసేవ జేయబూనుకొనుట.

మానవులు జీవనోపాధికిగాను పలువిధముల కృషిసల్పి ద్రవ్యసంపాదనను జేయుట విధాయకమని ఇదివరలో జెప్పబడి యున్నది. శ్లేష్మములోబడ్డ ఈగలాగు యెప్పుడును ద్రవ్యసంపాదనయందే యాసక్తి కలవాడై కాలమునుగడుపక, ప్రతి రోజునను నియామకముగ నొకకాలమును యేర్పాటు చేసుకొని, ఆకాలమునందు జగన్నాటకసూత్రధారుడై సృష్టిస్థితిలయములను గావించుచూ జగన్నాటకమును చిత్రవిచిత్ర కథలతో పూరితముగునట్లు గావించుచూ వినోదమునుబొందు మహానుభావునియొక్క గుణవైభవములను గురించియు, నీతిదాయకములగు విషయములనుగురించియు, మానవ జనోద్ధారణకు కారణభూతములగు విషయములను గురించియు బోధనజేయు

గ్రంథములను పఠనజేయుచూ యానందమును బొందుటకూడ మానవవిధాయకము అయియున్నది. చదువురానివారు, రామ మందిరములు వగైరా దేవత్థానములందు భజనలను సలుపు చూ, భజనలు సలుపలేనివారు భజనలను విని యానందించు చూ, దేవతాసంబంధమైన కార్యములను యతి శ్రద్ధాభక్తులతో నొనరించుచూ కాలమును గడుపుట విధాయకము. ప్రతి దినమున మనముచేయు పుణ్యపాపములను విచారించి, ఫలము నిచ్చు మహానుభావుడు వకరున్నారు, అను విషయము మరు వక, దినచర్యలను గావించుచుండవలయును. మరియు,

క॥ ఇందుగల డందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన నందందేగలడు దానవాగ్రణి వింటే॥

భగవంతుడు పిపీలికాది బ్రహ్మ పర్యంతము వ్యాపించి ప్రతివస్తువులోను వుండియున్నాడు. గనుక ప్రపంచసేవయే దైవసేవయగును. ప్రపంచసేవ, దేశసేవ, మానవసేవ, దైవ సేవ ఈమాటలన్నియు పర్యాయపదములుగ వాడబడవచ్చు ను. గావున సోదరులారా! స్వోదరపోషణకు మాత్రమే పాటు పడుచూ కూపస్థమండూకమువలె కాలమును వ్యయపుచ్చక “పరోపకార మిదంశరీరం” అను నార్యోక్తి ప్రకారము మా నవసేవ మూలకముగ దైవసేవ నొనరించి కృతార్థు లగుదురు గాక! మన యార్యావర్తములోను, యితరదేశములలోను మా నవసేవ, దేశసేవలకుగాను దేహములను యర్పణజేసి కృతార్థు లైన మహానుభావు లనేకులు కలరు. అట్టివారి పేర్లు ప్రతి వాని మనస్సునందు చెరిగిపోకుండునటుల, దివ్యాక్షరములతో

వ్రాయబడి, దేదీప్యమానముగ ప్రకాశించుచూ మానవులకు నుత్సాహమును ధైర్యసాహసములను గల్గించుచున్నవి.

(v) అత్యాశకు లోనుగాకయు, ధనమార్జనకు నీచ మార్గములను ద్రొక్కకయు, కష్టపడి చమటోర్చి సంపాదించిన దానితో పరమసంతుష్టిని బొందుట.

ఈసందర్భములో శ్రీశంకరాచార్యులవారి భజగోవింద శ్లోకములలో నొకశ్లోకమును మాత్రము వ్రాయుదును.

శ్లో॥ మూఢజహీహి ధనాగమతృష్ణాం
కురుసద్బుద్ధిం మనసివితృష్ణాం।
యల్లభసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయచిత్తం॥

ఈ శ్లోకార్థమె (v) విధాయకములో నిమిడియున్నది.

(2) పై కృత్యములను యాచరింపవలసిన పద్ధతులను నిర్ణయించుట.

మానవులు వారి జీవనోపాధిని సలక్షణముగ జరుపుకొనుటకు వాణిజ్యమునో, వ్యవసాయమునో, ఉద్యోగమునో, లేక మరియేవృత్తినో క్రమముగ జేసినగాని, యనుకూలపడదు. ఏవృత్తి ప్రారంభించినను, ఆవృత్తికి సంబంధించిన కష్టసుఖములను, లాభనష్టములను, మంచిచెడ్డలను, జయాపజయములను గురించియు, సదరు వృత్తిని సలుపవలసిన విధానమును గురించియు సంపూర్ణముగ, లోగడ సదరు వృత్తిని సలుపుచున్న పెద్దలవల్లను, గ్రంథముల మూలకముగను బాగుగ దెలిసికొనవలసి యుండును. అట్లుచేయని పక్షమున మధ్యలో

నాటంకములు సంభవించి, పని యాగిపోవుటయేగాక, ద్రవ్య నష్టమునకు కారణమగుట కూడ సంభవించును. కావున నేపనినైనను బాగుగ నాలోచించియే ప్రారంభించవలసి యుండును. చేయదలచిన పనిని ముందుగ స్థిరపరచుకొని, యాపనిని యేవిధముగ జేయవలసి యుండునో యావిధానమునుకూడ ముందుగనే స్థిరపరచుకొనుట సర్వదా శుభకరమగును. విద్యార్థులు, ఉద్యోగస్థులు, వ్యవసాయదారులు, వర్తకులు, కూలీవాండ్రు అనగా పాటకజనులు మొదలగువారు, వారుచేయవలసిన పనులను గురించి బాగుగ దెలిసికొని, సదరు పనులను జేయుటలో విధానమును యేర్పాటుచేసుకొని, సదరు యేర్పాటుప్రకారము యాచరించిన పక్షమున, వారు జయమును తప్పక పొంది లాభమును బొందగలరు. ప్రధమముననే యెట్టి యేర్పాటును జేసుకొనక ప్రారంభించినచో, మధ్యలో ననేకయవాంతరములు సంభవించి తుదకు చేయదలచిన పని యేవిధముగ పరిణమించునో చెప్పజాలము.

విద్యార్థులు విద్య నభ్యసించుటకుగాని, శరీరవ్యాయామములను నభ్యసించుటకుగాని, విశ్రాంతిని యనుభవించుటకుగాని, ప్రత్యేకకాలములను నియామకముచేసి తిదనుగుణ్యముగ ననుష్ఠించినచో, వారు వారి పరీక్షలలో గెలుపును బొందుచూ, గొప్ప పదవిని బొందుటకు నర్హులుకాగలరు. విద్యార్థులకు జ్ఞానాభివృద్ధికి విద్యయెంత యావశ్యకమో, శరీరారోగ్యమునకు వ్యాయామములు సహితము యంత యావశ్యకములే. పాఠశాలలలో సహితము ముందుగ నేర్పర్చబడిన కార్యక్రమణిక (Time table) ప్రకారము విద్యార్థులకు పాఠములు, వ్యా

యామములు బోధింపబడుచుండును. అందువల్లనే విద్యార్థులకు సులభముగ విద్యయబ్బి, యధిక సంఖ్యాకులు విద్యావంతులగుట సంభవించుచున్నది. అదేవిధముగ నుద్యోగస్థులు సహితము వారు చేయవలసియున్న పను లన్నిటికిని ప్రత్యేకకాలములను పద్ధతులను యేర్పర్చి, సదరు యేర్పాటు ప్రకారము పనులను నెరవేర్చుచుండిన పక్షమున, పనులన్నియు సలక్షణముగ జరుగుటకు కారణమగును. అట్లే యేవృత్తి నియాచరించుచున్నను, యావృత్తికి ననుగుణ్యముగ విధానములను కాలములను యేర్పర్చి న్నాచరించు చుండిన పక్షమున, సదరు వృత్తి సలక్షణముగ జరుపబడి, చేయువారికి తుదకు లాభదాయకమగుటకు యావంతయు సందేహముండజాలదు.

ప్రతిపనియును దానికి ననుకూలమైన సమయములో జేయవలసియుండును. సేద్యములో విత్తును జల్లుటకు, ఆకుమళ్ళను పోయుటకు, పొలములలో ఊడ్పుల నూడ్చుటకు, కోతలను కోయుటకు, అదేవిధముగ వ్యాపారములో సరుకులను గొనుటకు, సరుకులను విడుదలజేయుటకు, ప్రత్యేకకాలములు నియమింపబడియున్నవి. సదరు నియామకము ప్రకారము జరుపక నుపేక్షించిన పక్షమున పని క్రమముగ జరుగక పోగా, నష్టముకల్గుట సంభవించును. కావున కాలమాన పరిస్థితులను బాగుగ గుర్తెరింగి, తత్తత్కాలానుగుణ్యముగ పనుల నాచరించుచుండ వలయును. సకాలములో జేయక నుపేక్షజేసినపక్షమున, సదరుపని దర్మిలా యెంతజాగరూకతతో జేయబడినను, సకాలములో జేయని హేతువుచే సక్రమముగ సఫలము కాజాలదు. మరియు మానవులు వారు చేయబూ

నిన ప్రతికార్యమునకు ముందుగనే కార్యవిధానమును (అనగా యేపద్ధతుల ప్రకారము కార్యమాచరింపబడ వలయును) ఏర్ప ర్చుకొని తదనుగుణ్యముగ జరుపుచుండిన పక్షమున, సదరుపని నిరాటంకముగను, నిరాయాసముగను జరుగుట సంభవించును.

ఇల్లును కట్టుటకుముందు, కట్టబోవు యింటికి ప్లాను, సదరు ప్లానుప్రకారము యింటిని గట్టుటకు గావలసిన సామగ్రి యును, సదరు సామగ్రులను కొని తయారుచేయుటకు గావలసిన పైకమును తెలుపునట్టి యెస్టిమేటు తయారుచేయబడును. ప్లానుయొక్కయు, యెస్టిమేటులో నుదహరింపబడిన వస్తువుల యొక్కయు సహాయముతో నిల్లు బహుసులభముగ తయారు కాబడగలదు. అదేవిధముగ నేపనికైనను ముందుగ సదరు పనిని సాధింపగల పరికరములను విధానమును సిద్ధపరచుకొని ప్రారంభించుట విధాయకము. అందుమూలకముగ విశేష ఆయాసము—కాలయాపనము కలసివచ్చుటయేగాక, ద్రవ్య ము సహితము వ్యర్థము కాజాలదు.

ఈ విధాయకమును క్రమముగ నాచరించుటకు ప్రతి మానవునికి మూడు ముఖ్యగుణము లావశ్యకము. (1) వివేకము (Prudence). (2) పట్టుదల (Perseverance). (3) నిర్ణీతకాలకార్యాచరణము (Punctuality).

వివేకము:— మానవునికి వివేకముండినగాని, చేయబూనిన యేపనియు సాఫల్యము కాజాలదు. పనిని జేయుటలో బుద్ధి కుశలత, ముందాలోచన యత్యావశ్యకములైనవి. అవిలేక మానవులు యెంత స్వల్పమైన పనులను చేయ బూనుకొనినను వ్యర్థమేయగునని వేరు చెప్పనవసరమా? 'శుభాశుభములను

గాని, లాభనష్టములనుగాని, జయాపజయములనుగాని, అవస రానవసరములను గాని వివేకమువల్లనే దెలిసికొనుటకు వీలగును. పనులను జేయునపుడు సంభవించు చిక్కులను వివేకము మూలకముగనే తప్పించుకొనవచ్చును. ఎట్టి యసాధ్యమైన పని నైనను వివేకమువల్ల కష్టపడి సాధింపవచ్చును. మానవునికి వివేకము లేనియెడల, ప్రపంచక మంతయు గాఢాంధకార మయముగ దోచుచూ, యేమిచేయుటకు దోచక స్థంభితుడై పోయి తుదకు పిచ్చివాడగుట సంభవించును. గావున మానవునికి వివేకము యత్యావశ్యకము.

పట్టుదల:— ఏ పనినైనను పారంభించుటకు ముందె, దానియొక్క కష్ట సుఖములను—సాధ్యాసాధ్యములను గురించి బాగుగ విచారించవలసియుండును. అట్లు చేయక ముందుగ ప్రారంభించి, మధ్యలో నసాధ్యమని మానివేసినపక్షమున, నట్టి వ్యక్తికి నష్టదాయక మగుటయేగాక, నుత్సాహ భంగకరము సహితము యగుట సంభవించును. కావున నట్టి సమయములలో నధైర్యమును బొందక, సదరు పనిని నేవిధముగనైనను సాధింపవలయుననెడి పట్టుదలతో భగవంతునిమీద భారమువేసి పనిని చేయుచుండిన పక్షమున, తప్పక యాపని సానుకూలము కాగలదు; లాభదాయకము కాగలదు; జయప్రదము కాగలదు; కీర్తిదాయకము కాగలదు. "మనవల్ల కాజాలదు" అని యధైర్యపడిగాని—నిరుత్సాహుడైగాని యేపనిని వదల రాదు. 'నేను చేయగలను—నేను చేసితీరుదును' అను దృఢ సంకల్పముతో నడుము కట్టుకొని కృషి సల్పుటయే మానవ విధాయకము గాని, 'నేను చేయలేను' అను మాటను మనస్సున

దలచుట సహితము మానవులకు గౌరవప్రదము కాజాలదు. ప్రారంభమున నెన్నియో యపజయములను బొందిగాని రాజ్యములు స్థాపింపబడియుండలేదు. గొప్ప లోకోపకారములైన సంగతులు కనిపెట్టబడి యుండలేదు. గావున పట్టుదలయే వీటికన్నిటికి మూలకారణము. ఎట్టి వివేకవంతునికైనను పట్టుదల లేనియెడల ప్రపంచకములో జయశీలుడు కాజాలడు. గావున పట్టుదల సహితము మానవునికి ముఖ్యావశ్యకము.

నిర్ణీతకాల కార్యాచరణము (Punctuality):— అనగా యేకార్యమునైనను యనుకున్న ప్రకారము యనుకున్న వేళకు జేయుటయే.

ఈసందర్భములలో కాలముయొక్క విలువను గురించి స్వల్పముగ వ్రాయుదును. కాలము బహు విలువకలది. కాలమే ధనమని సహితము కొందరు యార్థికశాస్త్రజ్ఞులు చెప్ప సాహసించుచున్నారు. కాలమును వృధపుచ్చుట యనగా ధనమును దుర్వ్యయమును జేయుటగ భావింపబడును. ప్రపంచకములోని జీవరాసులకు భగవంతుడు యాయువును నియమించి సృజించియున్నాడు. ఆయాయువుయొక్క నిర్ణీత కాలము యింతయని యూఢిగ జెప్పుటకు నేరికిని సాధ్యముకాజాలదు. ప్రతినిమిషకాలము గడిచినకొలది, యాయువు పరిమితితగ్గి, మృత్యువు సమీపించుచున్నది. కావున మనము చేయవలసిన పనులను 'చేయుదుములే' యని నిలుపుట నుచితముకాదు. పైనిమిషము మనదికావచ్చును; కాకపోవచ్చును. గనుక నెప్పటి కార్యమును యప్పుడే పాలుమాలక జేయుట విధాయకము. 'తర్వాతచేయుదుము', 'రేపుచేయుదుము' యను మాటలమూల

కముగ మానవులకు ననేక ననర్థకములు సంభవించు చున్నవి. కాలహరణముకూడ జరుగుచున్నది. ‘తర్వాత’—‘రేపు’ అను మాటలను నమ్మి యేపనినైనను జాపరాదు. ‘తర్వాత’ ‘రేపు’ లలో నేతొందరపని రాగలదో లేక యేకష్టము సంభవించునో లేక మన పరిస్థితులు యేవిధముగ మారగలవో యెవరు చెప్పగలరు. ఇట్టి యాటంకముల మూలకముగ, వెంటనే చేయక నాపినపనిని చేయుట సంభవించక పోవచ్చును. అందువల్ల ననేకచిక్కులు సంభవించవచ్చును. కాలము రెక్కలుగల పక్షివలె యెగిరి పారిపోవుచుండును. కావున విద్వాంసులు కాలములోని ప్రతినిమిషమును సద్వినియోగపరచుచూ పలువిధముల లాభమును బొందుచున్నారు. కాలముయొక్క విలువ దెలిసినవారు క్షణమునయినను వృథాబుచ్చక, నేదో యుపయోగకరమైన పనిని నాచరించుచునే యుందురు. వ్యవసాయదారులకు, వర్తకులకు, యితర వృత్తుల నవలంభించువారికి కాలము బహు విలువగలది. వారు యేపరిస్థితులలోనైనను, మరుపువల్లగాని, బద్ధకమువల్లగాని, జేయవలసిన పనిని సకాలములో జేయనిపక్షమున, యనేక చిక్కుల పాలగుట సంభవించుచున్నది. కావున, మానవులు వారి విధ్యుక్త ధర్మములను యతిజాగరూకతతోను, శ్రద్ధాభక్తులతోను, సకాలములో జరుపుచుండవలయును. మనము యేపనిని యేవేళకు జేయ నిర్ణయించుకుంటిమో, యావేళకు నాపనిని తప్పక చేయుటయే విధాయకము. ఇట్టి యలవాటు మనదేశస్థులకు విశేషముగ లేదనియు, అందువల్లనే యితర దేశస్థులవలె మన దేశస్థులు ద్రవ్యసంపాదనను గావించుటలేదనియు

కూడ కొందరు యాక్షేపించుచున్నారు. ఈమాటలను నిరాకరించుటకు వీలులేదు. కొంతమట్టుకు వాస్తవమె.

ప్రతిమానవుఁడు వేకువఝామున నిదురనుంచి మేల్కాంచి డములోనే భగవత్ ప్రార్థనను ముగించి, ఆదినమున జరుపవలసిన కార్యములను, యాకార్యములను జరుపవలసిన కాలములను దెలుపు ఒక పట్టీని తయారుచేసి, తదనుగుణ్యముగ ప్రవర్తించుచుండిన పక్షమున, అన్ని పనులు సలక్షణముగ జరుగుటయేగాక తనయొక్కయు, తనతో పనులున్న వారియొక్కయు కాలము వృథాకాకుండుటగూడ సంభవించును. ఒకరి నిమిత్తం యతను, యతని నిమిత్తం యితరులు వృథాగా కాలమును గడుపుచూ కనిపెట్టుకొని యుండుట సంభవించదు. ప్రజల సభలకు అధ్యక్షులుగాని, ఉపన్యాసకులుగాని సకాలమునకు రానియెడల, సభికుల యాందోళనమును మనము చూచుచునే యున్నాము. కావున నిర్ణీతకాలకార్యాచరణము నాచరించు వారికిని, వారితో సంబంధించిన యితరులకును పలువిధముల లాభదాయక మగుచుండును; శ్రేయోదాయకము కూడ నగుచుండును.

రైల్వేలలోను, పోస్టాఫీసులలోను, బ్యాంకులలోను, తదితర ఆఫీసులలోను నిర్ణీతకాల కార్యాచరణము కఠినముగ నవలంబింపబడు చున్నందుననే, ప్రాపంచక వ్యవహారము లన్నియు క్రమముగాను సకాలములోను జరుగుట సంభవించి పలువిధముల సౌకర్యములను మానవులకు గలుగజేయుచున్నవి. అట్టి యాచరణమే యమలులో లేనియెడల, వ్యాపారము వృద్ధి బొందుటకు నవకాశముండజాలదు. వ్యవహారములన్నియు

కట్టుదిట్టముగను, సలక్షణముగను జరుగుటకు వాస్కారము మండకపోగా, తారుమారుయగుట సంభవించును.

కావున మానవులు యేపనినైనను వివేకముతోను, పట్టుదలతోను, నిర్ణీతకాల కార్యాచరణముతోను ముందుగ కార్యవిధానమును యేర్పరుచ్చుకొని యాచరించిన పక్షమున, సదరు పనులు తప్పక సానుకూలమగుచూ జయప్రదములు కాగలవు.

(3) దురభ్యాసములు లేక సత్ప్రవర్తనగలవాడై యుండుట.

దురభ్యాసములు యనగా చెడుయలవాటులు. పలు విధములైన చెడుయలవాటులలో ప్రాధాన్యములైనవి త్రాగుడు, జూదము, వ్యభిచారము, దొంగతనము మొదలైనవి యైయున్నవి. దురభ్యాసములకులోనై ప్రవర్తించువ్యక్తి దుర్మార్గుడు అని పిలువబడుచుండును. దుర్మార్గుడు చేయు వ్యాపారములన్నియు దుర్వ్యాపారములు కాగలవు. గాని సద్వ్యాపారములు యెన్నడును కాజాలవు. లోగడ నుదహరించిన ప్రకారము, దుర్వ్యాపారములు చేయువారికి నష్టమును కల్గించుట యేగాక, తత్సంబంధీకులకు సహితము చిక్కులు సంభవించునటుల జేయుటకు సహకారియగును. దురభ్యాసములు యంటుడు జాడ్యములవలె, బహుబలవత్తరములై, మనుష్యులను పీల్చి పిప్పిచేసి తుదకు మృత్యుదేవత పాలు సహాయము చేయ సమర్థత కలవి. ప్రపంచకములో పిశాచములు మనుష్యులను యావేశించిన పక్షమున, తిప్పలుపడి వదల్చుకొనవచ్చును; కాని యీదురభ్యాసములనెడి పిశాచములు మనుష్యులను యావేశించిన పక్షమున, మరణముతోనే వదులునుగాని, యీమధ్య

యెన్ని పాట్లు పడినను వదలజాలవు. ఈ దురభ్యాసములన్నియు దారిద్ర్య దేవతా పెద్దమ్మకు ముఖ్య సహకారులు. వీరు కాలు పెట్టినచోట భస్మమె. ఇల్లుగుల్ల, వొళ్లుగుల్ల; సిరిసంపత్తులతో తులతూగుచూ మహావైభవముతో ప్రజ్వరిల్లుచున్న గొప్పభవనములలో సహితము వీరు ప్రవేశించిన పక్షమున, సిరి వెంటనే మటుమాయమైపోవును; వెంటనే సదరు భవనము [illegible] లక్ష్మీకళపోయి, స్మశానకళ యావేశించును. పెద్దమ్మ పరిచారకులు అందరు వక్కసారిగా యెవరిని అయినను యావేశించరు. ముందు త్రాగుడు ఔషధముగ నభ్యసింపబడి, పాదు కుదుర్చుకొనిన పిదప, మిగతావి వొకొక్కటిగ జేరి సంపూర్ణ[illegible]నమును త్వరలోనే గావించును. ఈ విషయములన్నిటిని [illegible] కన్నులార చూచుచునే యున్నాము. చెవులార [illegible]చునే యున్నాము. గావున వీటిని గురించి విస్తరించి వ్రాయబూనుకొనుట సరసముగ నుండజాలదు.

మానవులు యిట్టి దురభ్యాసములకు లోనుగాక సత్ప్రవృత్తిగలవారై ధనమార్జనకు కృషిసలుప ప్రారంభించినపక్ష[illegible] వారి ప్రయత్నములన్నియు సఫలమగుటయేగాక, జయ[illegible]లగుచూ వారి యభివృద్ధికి దోడ్పడగలవు. సత్య[illegible] పాడినమాట ప్రకారము ప్రవర్తించుట, పెద్దల [illegible]ధేయత, పాలుమాలక కృషిసల్పుట, శుచిర్భూతము [illegible] ధైర్యస్థైర్యములను గల్గియుంచుట మొదలగునవి సత్ప్ర[illegible]లక్షణములు అయి యున్నవి. వాటిలో ముఖ్య[illegible]మాటప్రకారము ప్రవర్తించుట' అనునది సహ

కారసంఘముల మెంబర్లవల్ల ననుష్ఠానింపబడవలసిన విషయము అయి యున్నది.

మానవులు ధనమార్జనను ముఖ్యముగ గావింపవలసిన విషయము. దురభ్యాసములకు లోనుగాక, సత్ప్రవర్తన కల వాడై, మంచి తెలివి, పట్టుదల కలవాడై, చేయదలచిన వృత్తిని పాలుమాలక ననుష్ఠించుచూ, ధనమార్జనను గావింప వలయును. న్యాయమార్గమున సంపాదింపబడిన ధనమే సదా వంశవృద్ధిని గావించుచూ, మహదైశ్వర్యవంతులను జేయును. అన్యాయమార్గమున సంపాదింపబడిన ధనము తత్కాలపు సుఖము నొసంగినను, తుదకు వంశవృద్ధికి తోడ్పడకపోగా, సంపాదించినమానవునికి మనశ్శాంతిని సహితము కలిగింపజాలదు. వకరి మనస్సును కష్టపెట్టి సంపాదింపబడిన సొమ్మువల్ల సంపాదించినవారికి, కష్టపెట్టబడినవాని వుసురు తగులక మానదు. గనుక మానవులకు న్యాయార్జితమైన విత్తమే సదా సౌఖ్యకరము. యారోగ్యకరము. క్షేమకరము కాగలదు.

ధనముతో నిహపరసౌఖ్యములను బొందవచ్చును. గావున యట్టిధనమును కష్టపడి సంపాదించి, పదిలముగ వాడుకొనుచూ, మిగిలినదానిని దాచి రక్షించుకొనవలయును. ధనమును రక్షించుకొను విధమును గురించి విచారింతము.

---

## నా ల్గ వ అ ధ్యా య ము.

గత యధ్యాయములో ధనమార్జనను గురించి విపులముగ వ్రాయబడి యున్నది. ఈ యధ్యాయములో నార్జన

చేయబడిన ధనము యేవిధముగ రక్షింపబడవలయునో విచారింతము. ధనము మానవులకు పలువిధములైన ధాన్యరూపకముగగాని, బట్టలువగైరా రూపకముగగాని, వెండి బంగారు వస్తువుల రూపకముగగాని, వెండి బంగారు నాణెములు, కర్రెన్సీనోట్ల రూపకముగగాని, వుండును. అన్నిటిలోను బంగారు వెండితో సంబంధించిన వస్తువులు విశేషము విలువగలవి అయియుండును. సంపాదించిన ద్రవ్యములో సంసారపోషణ వగైరాలకు ఖర్చుపోను మిగతాద్రవ్యమును ముందు సంభవించు కష్టసుఖములకుగాను పదిలముగ దాచి రక్షించుటయె ముఖ్య విధాయకము అయియున్నది. అట్లు గావించని సంసారములు పలువిధముల చిక్కులపాలై యధోగతిపాలగుచున్నవి. గావున ప్రతి మానవుడు తాను సంపాదించిన ద్రవ్యములో కొంత భాగమును మిగిల్చి, పదిలముగ దాచుకొనినగాని, అతని యొక్కయు, యతని యాత్మబంధువుల యొక్కయు జీవితములు సలక్షణముగ జరుపబడజాలవు. అట్లు మిగల్చబడిన ధనమును, రక్షించు మార్గములను గురించి విచారింతము.

(1) ధనమును రొక్కముగ నింట్లో దాచుకొనుట మూలకముగ, వడ్డీలాభము లేకపోగా, చోరభయమువల్ల మనఃస్వస్థత లేకయు, యెప్పటికప్పుడు నూతివొడ్డు బిడ్డ సామెతగా వుపద్రవముతో కూడుకొనినదిగను, సదరుధన ముండగలదు. మరియు ధనమును యింట్లో నుంచుటమూలకముగ, ననేకనర్థకములకు గారణమగును. గావున యీపద్ధతి యాచరణ యోగ్యము కాజాలదు.

(2) ధనికులవద్ద దాచుకొనుట; సదరు ధనికులు చేయు

వ్యాపారములు క్రమముగను—సలక్షణముగను జరుగుచున్నంత వరకు, వీలుగనే యుండును. సామాన్యముగ ధనికులు చేయు వ్యాపారముల లెక్కలు వగైరాలు ప్రతి సంవత్సరము ఆడిటు చేయబడుట సంభవించదు. కావున వారి వ్యాపార పరిస్థితులు కొన్ని సమయములలో యజమానులకు సహితము గోచరమగుట నసంభవముగ నుండును. మరియు ధనికులు చేయు వ్యాపారములకు వారే స్వతంత్రాధికారులుం. కనుక వారి యిష్టానుసారము వారి వ్యాపార పరిస్థితులను మార్చు చుండవచ్చును. లాభదాయకమని చేయెడల, దివాలా యగుట సంభవించును. అందుమూలకముగ, నట్టివారితో లావాదేవీలు కలవారందరికీ నష్టము వాటిల్లి కష్టము పాలగుట సంభవించుచున్నది. కావున ధనికులవద్ద దాచుకొనుట సహితము సదరు ధనికుల యోగ్యతాయోగ్యతలను బాగుగ విచారించి తగు జాగ్రత్తతో చేయబడుచుండుట విధాయకము.

(3) లోకులకు స్థిరచరాస్తుల హామీమీద ఋణముల నిచ్చుట, చాలవిధముల ననుకూలమైన లాభదాయకమైన విషయము అయియున్నది. తాకట్టు పెట్టుకొనదలచిన యాస్తి యేవిధముగ అన్యాక్రాంతము చేయబడక, సంపూర్ణహక్కు భుక్తములు గలది అయినట్టు ధ్రువపరచుకొని, ఋణమును యిచ్చుటయే విధాయకము. ఋణమును పుచ్చుకొనినవారు యేవిధమైన పేచీలను పెట్టక, యనుకున్న ప్రకారము బాకీని దీర్చిన పక్షమున, ఋణమునిచ్చిన వారికి, పుచ్చుకొనినవారికి జాలవిధముల సౌకర్యములను గలుగజేయుటకు నావంతయు సందేహముండజాలదు. కాని యట్లుచేయని పక్షమున, యిద్దరికి

వ్రియ ప్రియాసలకు కారణమగును.

(4) (Postal Savings Bank) లో దాచుకొనుట సహిత ము క్షేమకరమైన పనిఅయియున్నది. ప్రతి పెద్ద పోస్టాఫీసు లోను సేవింగ్సుబ్యాంకు పద్ధతి, ప్రభుత్వమువారి యాజమాన్య ము జవాబుదారీలకిృంద యేర్పాటుచేయబడి సక్రమముగ పను లను జరుపుచున్నది. కాని ప్రస్తుతదినములలో జాయంటు స్టాకుబ్యాంకులు, సహకార సంబంధమైన బ్యాంకులు విరివిగ దేశమందంతటను స్థాపింపబడి, వాటిలో సేవింగ్సు బ్యాంకు పద్ధతి సహితము విరివిగ పనులను జరుపుచున్నది. ప్రస్తుత పోస్టలు సేవింగ్సుబ్యాంకు నిబంధనలకంటె, యితర సేవింగ్సు బ్యాంకులలోని నిబంధనలు ప్రజలకు నెక్కువ యనుకూలము గను, యెక్కువ లాభదాయకముగను వుండుట సంభవించు చున్నది. కావున దాచుకొన దలచినవారు వివిదబ్యాంకుల పరిస్థితులను బాగుగ విచారించి చేయుట విధాయకము. జాయం టుస్టాకు బ్యాంకులలో డిపాజిట్లు మూలకముగ కొందరు వారిధ నమును దాచుకొనుచుందురు. వ్యక్తులు కొందరు భాగస్వా ములుగజేరి, బ్యాంకుగనేర్పడి, వసూలు అయిన మూలధనము తోను, భాగస్వాములు తదితరులిచ్చు వివిధ డిపాజిట్ల మొత్త ములతోను, ధనముకావలసిన యాస్తిపరులకు (భాగస్వాములు అనే నియామకము లేకుండగ) తగు హామీమీాద ఋణముల నిచ్చుచూ, వ్యవహారములను నడుపుచుందురు. సదరు బ్యాంకులెక్కలు, ప్రతిసంవత్సరము, బ్యాంకువారు యేర్ప ర్చుకున్న ఆడిటరువల్ల తనిఖీచేయబడి, ఆడిటు సర్టిఫికేటు తయారుచేయబడి, ప్రచురపరచబడు చుండును. సదరు సర్టిఫి

కేటు పరికారము, భాగస్వాములకు లాభములు పంచిపెట్టబడు చుండును. ఇట్టి బ్యాంకులు దేశమందంతటను విరివిగ స్థాపింపబడి ప్రజలకు పలువిధముల సౌకర్యములను గావించుచున్నవి. అనేకులు యీబ్యాంకులలో వారిధనమును దాచుకొని సుఖముగ కాలక్షేపము చేయుచున్నారు.

(5) సహకారబ్యాంకులు:— సహకార పరపతిసంఘములు సహకారోద్యమమునకు ప్రాతిపదికములు అయియున్నవి. సహకార సంఘములు, పరిమితిపూచీగల సంఘములనియు, పరిమితిలేని పూచీగల సంఘములనియు, రెండువిధములుగ విభజింపబడియున్నవి. పరిమితి పూచీగల సంఘములు సామాన్యముగ పట్టణములలోను పెద్ద గ్రామములలోను స్థాపింపబడి, శిల్పికారులు వగైరా పాటకజనుల యొక్కయు, చిన్న మొత్తముతో వ్యాపారమును సల్పు వర్తకులయొక్కయు, చిన్న జీతములతో పనిచేయు వుద్యోగస్థుల యొక్కయు, తదితర బీదజనుల యొక్కయు వుపయోగము నిమిత్తం పనిచేయుచుండును. ఇట్టి సంఘములలోని ప్రతి మెంబరుయొక్క బాధ్యత సదరు మెంబరు సంఘములో తీసుకొను షేరుధనము మొత్తము వరకే పరిమితికలది అయియుండును. ఈ సంఘములు లిమిటెడు (Limited) సంఘములు అని పిలువబడుచుండును. పరిమితిలేని పూచీగల సంఘములు సామాన్యముగ గ్రామములలో స్థాపింపబడుచుండును. ఆగ్రామములోని వ్యవసాయదారులు వగైరా పాటకజనుల వుపయోగము నిమిత్తం పనిచేయుచుండును. సంఘములు చేయు యావత్తు ఋణములకు సంఘములోని మెంబర్లందరు సమూహాముగను ప్రత్యేకముగను పూచీపడ

వలసి యుండును. ఏపరిస్థితులలోనైనను, బాకీదార్లనుంచి బాకీలు పూర్తిగ వసూలు కాజాలక సంఘము సెంట్రలు బ్యాంకునుగాని, లేక మరి యే యితర సంస్థనుగాని వాయిదామీరి బాకీపడి తీర్చలేని పక్షమున, సదరు బాకీమొత్తము సంఘ మెంబర్లందరినుంచి గాని, లేక యే వకరిద్దరు మంచి యాస్తిపరుల వద్దనుంచిగాని వారి వాటాల దామాషాగా వసూలు చేయబడును. ఇదియె పరిమితిలేని పూచీ యొక్క పరమ రహస్య సిద్ధాంతము. అయితే అట్టిపరిమితిలేనిపూచీ సంఘముయొక్క రిజిస్ట్రేషను రద్దుపరచబడిన తరువాతగాని యమలుజరుప వీలుండదు. ఇట్టిసంఘములు పరిమితిలేని (Unlimited) పూచీ సంఘములు అని పిలువబడుచుండును. మరియు సహకార సంఘములలో సంఘ మెంబర్లకే యప్పులు యివ్వబడుచుండును. మరియు మెంబర్లు కాకపోయినను, సంఘములలో డిపాజిట్లమూలకముగ ధనమును దాచుకొనిన పక్షమున, వారికి సహితము వారి డిపాజిట్లు హామీమీది నూటికి తొంబదికి మించకుండగ ప్రస్తుత సహకారచట్టము ప్రకారము యప్పులనిచ్చుటకు వీలగుచుండును.

అన్ని సహకార పరపతిసంఘములయొక్క లెక్కల తనిఖీ (Audit) ప్రభుత్వోద్యోగీయులవల్ల ప్రతిసంవత్సరము గావింపబడి, సదరు రిపోర్టులు ప్రచురపరచ బడుచుండును. ఈ సంఘములన్నిటికిని కావలసిన ఋణములు సహకార సెంట్రలు బ్యాంకులవల్ల నివ్వబడుచుండును. ఈ సంఘములన్నియు సెంట్రలుబ్యాంకుల నిబంధనల ననుసరించి షేరుధనమును జమకట్టి మెంబరుగజేరి, ఋణమును బుచ్చుకొనుటకు వర్హతను గలుగజేసుకొనును. ఇతర బ్యాంకులకంటె సహకారబ్యాంకు

లకు నాధిక్యత రెండువిషయములలో గలదు. (1) సహాకార బ్యాంకులు పరిమితిలేని పూచీగల సంఘములకు నప్పుల నిచ్చుచుండును. (2) ప్రభుత్వోద్యోగియులవల్ల ప్రతిసంవత్సరము అన్ని సహాకారసంఘముల లెక్కలు ఆడిటు చేయబడుచుండును. ప్రస్తుతము అమలులోనున్న అన్ని హామీలకంటెను, పరిమితిలేని పూచీ పరమ యుత్తమమైనదిగ కనబడుచున్నది. అట్టి పూచీతో నివ్వబడిన బాకీలు యేమాత్రము పోజాలవు. దమ్మిడీలతో సహా వసూలుయగుటకు వీలగుచున్నది. మరియు అవసరమైనయడల సహాకారసంఘ బాకీలు రివిన్యూ ఉద్యోగస్థులవల్ల రివిన్యూబాకీలు వసూలు చేయబడురీతిగ వసూలు చేయబడుచుండును. ప్రస్తుత సహాకారచట్టము ననుసరించి, బాకీల వసూలువిషయమై ప్రభుత్వ సహాకారోద్యోగియులకు నెక్కువ యధికారములు సహితము నొసంగబడియున్నవి. కావున సహాకార సంఘములకు నొసంగబడిన బాకీలు పూర్తిగ వసూలుచేయబడి సహాకారబ్యాంకులకు చెల్లింపబడుటకు నవకాశము గల్గుచున్నది. కావున మనదేశములో బనిచేయు యన్ని సంస్థలలోను, ధనమును క్షేమముగ దాచుకొనుటకు సహాకారబ్యాంకులు పరమోత్తమమైనస్థానమును బొందియున్నవని ఘంటాపథముగా నుడువుటకు నాస్కారము కలుగుచున్నది.

(6) ప్రాణములను భీమాచేసుకొనుట Insurance Companies)

ప్రాణములను భీమాచేసుకొను పద్ధతి మనదేశములో ప్రస్తుతము బహువిరివిగ వ్యాపించుచున్నది. వివిధ ప్రాంత

నుల భీమాచేయు (Insurance) కంపెనీలు స్థాపింపబడి, యేజెంట్లు యేర్పడి, మారుమూల గ్రామములలో సహితము భీమాచేయుటకు సంబంధించిన సూత్రములను బోధించి, అనేక వ్యక్తుల ప్రాణములను భీమా చేయించుచున్నారు. ప్రాణములను భీమాచేయుట మూలకముగ, మానవులు వారి వృద్ధాప్యదశలో సుఖముగ కాలక్షేపము జేయుటకు గావలసిన ధనము సదరు కంపెనీవారివల్ల సిద్ధము చేయబడుచుండును. త్వరలో వారు మరణించిన పక్షమున, వారి తదనంతరం, వారి యాత్మబంధువులు యేవిధమైన కష్టముల పాలుకాకుండ దినములను సుఖముగ గడుపుటకు, మరియు మరణించిన వారి సంపాదన లోపము కనబడకుండునట్లు, కంపెనీవారివల్ల ద్రవ్యము సిద్ధపరచబడును. మానవులు యారోగ్యవంతులై యౌవనదశలో నుండి, ద్రవ్యసంపాదనను విరివిగజేయు దినములలో, నియమిత సంఖ్యగల సంవత్సరములకు, సంవత్సరమునకుగాని లేక యారు మాసములకుగాని యొకపర్యాయము కంపెనీవారివల్ల నియమింపబడిన నొక మొత్తమును జెల్లించుటకు యేర్పర్చుకొని, ఒకని యామక మొత్తమునకు భీమాకంపెనీలో ప్రాణమును భీమా చేసుకొనిన పక్షమున, నియమిత సంఖ్యగల సంవత్సరముల యాఖరున పైనియామక మొత్తము యావత్తు భీమాచేసుకొనిన వాని కివ్వబడును. కాలపరిమితి లోపలనే సదరు వ్యక్తి మరణించిన పక్షమున, భీమాచేయబడిన యావత్తు మొత్తము వాని వారసులకు నివ్వబడును.

ఉదాహరణము:— ఒక వ్యక్తి యారుమాసములకు నొక పర్యాయము రు 15 లు చొప్పున యిరువది సంవత్సర

ముల కాలమువరకు యిచ్చుటకు నేర్పాటు చేసుకొని, ఒక వెయ్యి రూపాయీలకు ప్రాణమును భీమా చేసుకొనిన పక్షమున, యిరువదవ సంవత్సరాంతమున, సగరు వెయ్యిరూపాయీలు భీమా చేసుకొనిన వ్యక్తికి నివ్వబడును. లేక సదరు వ్యక్తి యీ యిరువది సంవత్సరముల లోపలనే మరణించిన పక్షమున అతని వారసులకు భీమా చేయబడిన రు 1000 లు వెంటనే యివ్వ బడును.

సదరు విధముగ, మానవులు చిరకాలము జీవించిన పక్షమున, వారి వృద్ధాప్యకాలమును సుఖముగ గడుపుటకు సౌకర్యములు కల్గుచున్నవి. లేదా త్వరలో మరణించిన పక్ష మున, వారి వారసులకు జీవనోపాధిని కల్గించిన వారగుదురు. ఈపద్ధతి బహు యనుకూలముగనున్నదని భావించి, పలువురు పురుషులు, స్త్రీలు, ధనవంతులు పాటకజనులు విరివిగ నవలం బించుచున్నారు. స్వల్ప వేతనములుగల వారికి సహితము యీపద్ధతి బహుపీలుగ గనబడుచున్నది. స్వల్ప వేతనములు గల వారు స్వల్పమొత్తములకే భీమా చేసుకొనవచ్చును. ఇందు మూలకముగ, ధనమును విశేషప్రయాస లేకుండా, దాచుకొ నవచ్చును.

(7) డబ్బు సమృద్ధిగనుండి స్థిరాస్తులనుకొను పద్ధతి పరమో త్తమమైనదని చెప్పుట నిర్వివాదాంశము. భూములను కొన్న పక్షమున, ప్రతిసంవత్సరము ఫలసాయము వచ్చును. గృహ ములను కొన్న పక్షమున, అద్దెవచ్చును. కాని బహుస్వల్ప వడ్డీరేటు మాత్రము గిట్టుపాటగును. స్థిరాస్తిని కొనడము మూలకముగ డబ్బును సురక్షితముగ దాచుకొనడమగును.

(8) గవర్నమెంటు ప్రామిశరీనోట్లను కొనుట; ప్రభుత్వము వారు వారికి ధనము కావలసివచ్చినపుడెల్లను ప్రజలవద్ద నప్పాము పుచ్చుకొనుట వాడుక కలదు. నిర్ణీతకాలమునకు యావత్తు యసలు మొత్తము యివ్వబడుననియు, నిర్ణీతరేటుతో వడ్డీ ప్రతి యారుమాసములకు నివ్వబడుననియు మొదలగు షరతులతో ప్రభుత్వమువారు, యప్పిచ్చిన వానిపేర ప్రామిశరీ నోటును వ్రాసియిచ్చెదరు. తదనుగుణ్యముగ కార్యములు జరుగుచుండును.

ప్రారంభమున వడ్డీరేటు బహుస్వల్పముగ నుండియుండెను. రానురాను వడ్డీరేటు సహితము క్రమముగ హెచ్చి, బ్యాంకులు యిచ్చురేటుకు సమానముగను, కొన్నిపరిస్థితులలో హెచ్చుగను గూడ వుంటూవున్నది. ఏపరిస్థితులలోనైనను మన యవసరమునకు పైకము కావలసినపక్షమున, యీనోట్లను యితరులకు Imperial Bank ద్వారా యమ్ముటకు వీలగును. దేశకాలపరిస్థితుల ననుసరించి రు 100 లనోటు రు 100 లకే యమ్మబడవచ్చును; లేదా తక్కువ వెలకు లేదా హెచ్చు వెలకు యమ్మబడవచ్చును. ధనరక్షణకు యీమార్గము సహితము పలువురు ధనవంతులు త్రొక్కుచున్నారు.

(9) ఆభరణములు :— కొందరు ధనవంతులు వెండి బంగారు యాభరణముల నిమిత్తం విశేషధనమును వ్యయపుచ్చెదరు. సదరు యాభరణములు స్త్రీలకు-బిడ్డలకు ఒకవిధమైన యలంకారముగ నుండుననియు, అవసరపడేయెడల అమ్మకొనినధనము చేకూరగలదనియు కొందరు వాదింతురు. నిజమే; కాని యార్థికశాస్త్రరీత్యా విచారించినపక్షమున యట్లుచేయుట

పలువిధములైన ననర్థకములకు మూలకారణ మగుచున్నది. ఆభరణములవలన దొంగతనములు పలువిధములైన హత్యలు సహితము జరుగుచున్నవి. ఆభరణముల మూలకముగ ధనమునకు వడ్డీనష్టమగుటయేగాక, వాడుకవల్ల వెండియొక్క—గాని, బంగారుయొక్క—గాని విలువ దినదినక్షయమును బొందుచుండును. విశేషధనవంతులు యాభరణములను వాడవచ్చునని యొకవిధముగ నంగీకరించవచ్చును.

ధనరక్షణకుగల వివిధపద్ధతులలో కొన్ని ముఖ్యమైన వాటిని మాత్ర ముదహరించియున్నాను. ధనమార్జన—ధనరక్షణలను గురించి వ్రాసియుంటిని; ఇక ధనవ్యయమును గురించి వ్రాయవలసియున్నది. అదియె యీపుస్తకమునకు ప్రధాన విషయము.

## అ యి ద వ అ ధ్యా య ము

ఇదివరలో ధనమార్జనను గురించియు, ధనరక్షననుగురించియు కొన్ని ముఖ్యాంశములను వ్రాసియుంటిని. ఇక ధనవ్యయమును గురించి వ్రాయవలసియున్నది. ధనమును సంపాదించి పదిలముగ దాచడముతోనే, మానవుల జీవయాత్ర సుఖముగ సాగజాలదు. ధనమును వ్యయపరచకుండ నొకక్షణమైనను సంసారచక్రమును జరుపుట దుస్సాధ్యము. లోగడచెప్పిన ప్రకారము, ప్రపంచములోని ప్రతివస్తువు ధనమే. అట్టిధనమును లోహనాణెముల ధనముతోగాని, మన జీవయాత్రను నలుపవలసి యుండును. ధాన్యము పండించిన రహితు,

వాని ధాన్యమును యమ్మగా వచ్చిన ధనముతో బట్టలు—లోహ పుగిన్నెలు — తినుబండారములు వగైరాలను కొనవలసి యుండును. అట్లే వ్యాపారచక్రము లోహనాణెముల సహాయముతో తిరుగుచుండును. గావున మానవుడు ధనమును పెట్టెలోబెట్టి ఖర్చుచేయకుండగ దినములను గడుపుటకు ప్రియత్నించుట శుద్ధవెర్రితనముగ గనబడును. గనుక మానవునికి ధనమార్జన—ధనరక్షణ యెంతయావశ్యకములో, ధనవ్యయము సహితము యెంత యావశ్యకమై వున్నది. సదరు వ్యయమును గురించి విచారింతము.

వ్యయము రెండు విధములు:— మితవ్యయము లేక సద్వ్యయము; అమితవ్యయము లేక దుర్వ్యయము. అవసరమునకు ననుగుణ్యముగ వాడుట మితవ్యయమనబడును. అవసరానవసరములను గమనించక యిష్టానుసారము వాడుటయే యమితవ్యయ మనబడును. మరియు మితవ్యయము నభ్యసించు వ్యక్తి, లోభి యెన్నడును కాజాలడు.

## —♦ లోభి—మితవ్యయదారుల గుణభేదములు ♦—

మితవ్యయదారుడు ధనమును దుర్వ్యయము జేయక పదిలముగ దాచుచుండును. అట్లే లోభియు దుర్వ్యయమును జేయక ధనమును కాపాడుచుండును. కాని మితవ్యయదారుడు యవసరము కల్గినపుడు తనయొక్క, తనమీద నాధారపడియున్న వారియొక్క సుఖానుభవమునకుగాను ధనమును ఖర్చుపెట్టుచూ, మిగిలిన సొమ్మునే దాచుచుండును. అట్లుగాక, లోభి యవసరమునకు సహితము ధనమును వ్రియపరచు

టకు నిచ్ఛగించడు. ధనమును వ్రియపరచకుండా దాచుటయే పరమావధిగ సంతసించుచుండును. మరియు మితవ్యయదారుడు తన జీవనమును సుఖముగ జరుపుకొనుటకు, ధనమును భగవంతు డనుగ్రహించిన నొకసాధనముగ భావించి, యవసరమును బట్టి ఖర్చుచేయుచుండును. అట్లుగాక, లోభి ధనమును సాక్షాత్ శ్రీమహాలక్ష్మిగ భావించి, దానికి పలువిధముల పూజ లొనరించుచూ, సాష్టాంగ ప్రణామము లాచరించుచూ, ఒకదమ్మిడీనైనను దీసి ఖర్చుపెట్ట నొల్లడు. మరియు మితవ్యయదారుడు కష్టపడి మర్యాదగా సంపాదించినసొమ్ములో నవసరఖర్చులుపోను మిగతా ధనమును పదిలముచేయుచూ, సంతుష్టిని బొందును. అట్లుగాక లోభికి ధనసంతుష్టి కలుగుటయే దుర్లభము. మరియు, యవసరమందరికి యవసరమె. అట్టి యవసరమును తగు లక్ష్యభావముతో సకాలములో దీర్చిన పక్షమున, వ్రియము బహుస్వల్పముగ నగుటయేగాక, విశేష ప్రయాసపడవలసిన యవసరము సహితము నుండజాలదు. ఈ విధముగ మితవ్యయదారుడు పనులను నెరవేర్చుచుండును. లోభియో యట్లుగావించక, ధనలోభత్వముచే నశ్రద్ధజేయుట సంభవించును. అట్టి యశ్రద్ధయె యవసరమును బలపరచినందున, విశేష వ్రియ ప్రయాసలతోగాని సదరు యవసరము తీర్చబడజాలదు. ఈకారణముచేతనే, 'లోభికి ఖర్చు మెక్కువ' అను సామెతకలిగినది. కావున లోభిని సహితము యమితవ్యయదారుల జాబితాలో కొంతవరకు జేర్చుటకు ఆక్షేపణ యుండజాలదు.

## —♦ మితవ్యయమనగా యేమిటి? ♦—

మితవ్యయము స్వభావసిద్ధముగ మానవులకు కల్గు గుణముకాదు. మితవ్యయము, విద్యవల్లకల్గు జ్ఞానాభివృద్ధి వల్లను, ప్రతి దినము సంభవించు కష్టసుఖముల ననుభవము వల్లను, దెలుసుకొనదగిన విషయమై యున్నది. విద్యా విహీనులు, తెలివిమాలిన మూఢులు మితవ్యయముయొక్క విలువను గ్రహింపజాలరు. విద్యయు, లోకానుభవము మిత వ్యయమునకు మూలబీజములు. మానవులకు స్వార్థత్యా గము (అనగా ముందు సౌఖ్యమునకుగాను ప్రస్తుత స్వసౌఖ్య మును విడనాడుట) ముందాలోచన, వివేకము వుండినగాని మిత వ్యయమును యాచరణలోబెట్టి సంసారమును గడుపుటకు నర్హులు కాజాలరు. మానవులు కృషిసల్పినగాని, ధనమార్జ నను గావింపజాలరు. ధనమార్జనను జేయువారు మితవ్య యము నను్ష్ఠించినగాని ధనసంచయము కాజాలదు. అట్టి ధనసంచయముతోనే ప్రస్తుత నాగరికత ప్రబలుచున్నది. కావున మితవ్యయమే ప్రస్తుత నాగరికతకు యాధారభూత మగుచున్నది.

మితవ్యయము ననుష్ఠానమందుంచుటకు, విశేష ధైర్య సాహసములుగాని, విశేష తెలివితేటలుగాని, విశేష సద్గుణ సంపత్తిగాని యవసరము లేదు. కాని మానవులు ప్రపంచ జ్ఞానవాసనకలవారై యనవసరమైన స్వశరీర సౌఖ్యములను వాంఛించని పక్షమున మితవ్యయసిద్ధాంతములను సంపూర్ణముగ నాచరణలో బెట్టుటకు వీలగును.

మితవ్యయ మనగా హద్దుగల ఖర్చుయని యర్థము. ఖర్చుకు హద్దు యేమిటి? అవసరమునకు ననుగుణ్యముగ ఖర్చునుజేయుటయే ఖర్చుకు హద్దుగనేర్పడును. ఒకరూపాయితో సార్థాయగు పనిని ముగించుటకు ఖర్చుహద్దు ఒకరూపాయిమాత్రమే అయియుండును. మరియు మానవులు వారి వృద్ధాప్యదశలో దినములను సుఖముగ గడుపుటకును, యీ మధ్యలోసంభవించు కష్టసుఖములను యిబ్బందిలేకుండ గడుపుటకును, వారితదనంతరం వారి పిల్లలువగైరాలు సలక్షణముగ కాలమునుగడుపుటకును, కొంత ద్రవ్యమును నిలువజేయుట విధాయకము అయియున్నది. ఇందుకుగాను ద్రవ్యసంపాదన రోజులలో కొంతమొత్తమును మిగిల్చి దాచుచుండవలసి యుండును. అట్లుచేయుట, వ్యయమును మితముచేసినపక్షముననే సంభవించునుగాని, వేరువిధముగ సంభవింపజాలదు. కావున యవసరములకు ననుగుణ్యముగ ఖర్చునుజేయుటయే మితవ్యయ మనబడును. వ్యయమును మితముచేసి ముందు వుపయోగమునిమిత్తం ద్రవ్యమును మిగుల్చుటయే మితవ్యయముయొక్క ముఖ్యోద్దేశమై యున్నది.

మితవ్యయము ధనవంతులకు, ధనహీనులకు, వ్యవసాయదారులకు, వర్తకులకు, వుద్యోగస్థులకు, పాటకజనులకు, బీదలకు, స్త్రీలకు నత్యావశ్యకముగ నాచరింపబడవలసిన విషయమైయున్నది. ధనవంతులు మితవ్యయము నాచరించిన వారిధనము దినదినాభివృద్ధిని బొందుచుండును. ధనహీనులు యాచరించిన, ధనము మిగులుటసంభవించి దారిద్ర్యము తొలగిపోవును. ఏవృత్తిచేయువారైనను మితవ్యయ

యభ్యాసముతో వారుచేయు వృత్తులు లాభదాయకమగుటయే గాక, జయప్రదములుగూడ కాగలవు. స్త్రీలు మితవ్యయ సిద్ధాంతములను సంపూర్ణముగ గ్రహించి, వాటిని యాచరణలో బెట్టుచుండినపక్షమున, వారు నివశించు గృహములు స్వర్గ తుల్యసౌఖ్యముల నొసంగుటకు సందేహముండజాలదు. వీటి వివరములను గురించి ముందుపేజీలలో వివరించెదను.

వ్యక్తులుమొదలు సంఘములు, రాష్ట్రములువరకు మిత వ్యయమును యాచరించినగాని, యభివృద్ధిని బొందుట దుర్ల భము. ధనముండినగాని, వ్యక్తికిగాని, సంఘమునకుగాని, రాష్ట్రమునకుగాని పలుకుబడి క్షేమము వుండజాలదు. మంచి చెడ్డలు రెంటికిని ధనము కావలసియేయుండును. ధనసహా యమువల్ల నెట్టికష్టకార్యమైనను సాధింపబడవచ్చును. కావున వ్యక్తులు, సంఘములు, రాష్ట్రములు సంపూర్ణముగ ధనముండిన పక్షమున, నిర్భయముతోను, మనస్థైర్యముతోను దినములను గడుపుచుండును. ధనము సంపూర్ణముగ నుండుటకు మితవ్య యమే కారణమగుచుండును. సంపాదనద్రవ్యమునకు మించి వాడకుండుటయే మితవ్యయము కాగలదు. కావున మితవ్యయ సిద్ధాంతము వ్యక్తులకు, సంఘములకు, రాష్ట్రములకు మహోప కారమును గావించుచూ ప్రజలను పలువిధముల కాపాడు చుండును.

## మితవ్యయము—సహకారోద్యమము

ప్రథమ యధ్యాయములో సహకారోద్యమమునకు— మితవ్యయమునకు గల సంబంధమును గురించి కొంతవరకు వివ

రించియుంటిని. మితవ్యయమును, స్వసహాయశక్తిని మానవు లలో వృద్ధిపరచుటకే సహకారసంఘములు స్థాపింపబడినవి. స్వసహాయశక్తికి మూలాధారమ్ము మితవ్యయమే. స్వసహాయ శక్తియనగా, పరుల సహాయములేకయే (అనగా తనశక్తి సామర్థ్యములతోనే) తనయవసరములను గడుపుకొనుట యని యర్థము. అట్టి స్వసహాయ శక్తికి మితవ్యయము తోడ్పడిన గాని మానవులు సార్థాపడజాలరు. అట్టి మితవ్యయ సిద్ధాంతములు సహకారమెంబర్లలో సంపూర్ణముగ వ్యాపింపచేయబడని హేతువుచే, సహకార సంఘములను ప్రభుత్వమువారు సంఘ మెంబర్ల సౌకర్యమునకుగాను స్వల్పవడ్డీరేటుతో నేర్పరచినారని ప్రజలు యభిప్రాయపడుట సంభవించుచున్నది. మితవ్యయ మనగా యేమిటో యెరుగని విశేషమందికి సహకారసంఘము లలో నప్పు లివ్వబడుచున్నవి. అందుచేతనే విశేషసంఘ ములు క్రిమముగ వాటివిధ్యుక్తధర్మముల నాచరింపజాలక స్తంభించియుండుట సంభవించుచున్నది. సహకారసంఘ మెం ర్లకు మితవ్యయ సిద్ధాంతములను సంపూర్ణముగ బోధపరచి, వాటి ననుష్ఠానమందుంచునటుల గావించినపక్షమున, మెంబర్లభ్యా సించు దురభ్యాసములు, దుర్వ్యయములు నశించుటయేకాక మెంబర్లు సద్వృత్తికలవారై మితవ్యయమును గావించుచూ ధన వంతులగుట సంభవింపవచ్చును. మితవ్యయమునకు సహ కారముదోడ్పడిన పక్షమున, ప్రజలు పలువిధములైన సుఖ ముల ననుభవించుటకు కారణమగును. ఒకవ్యక్తివల్ల కానిపని, సంఘమువల్ల బహుసులభముగ జేయబడగలదు. కావుననే సహకారసంఘములు ప్రపంచమున వివిధప్రాంతములలో స్థాపిం

పబడి ప్రజలకు పలువిధములైన సౌకర్యములను కలుగజేసి సుఖముగ కాలమునగడుపుటకు దోడ్పడుచున్నవి. అట్టి సంఘములలో మెంబర్లకు మితవ్యయము ప్రధానలక్షణముగ నుండవలయును. అప్పుడే సహకారోద్యమమునకు జయము వాటిల్లగలదు. సహకారసంఘములు గ్రామములలోని వ్యవసాయదారుల యొక్కయు, పట్టణములలోని పాటక జనుల యొక్కయు స్వల్పసంపాదనపరులయొక్కయు వుపయోగము నిమిత్తం స్థాపింపబడి పనులను జరుపుచున్నవి. వీరిలో చాల భాగము విద్యావాసన లేనివారై దురాచారము లను, దురభ్యాసములను వదలలేక, పలువిధములైన కష్టములపాలగుచూ దినములను గడుపుచున్నారు. వీరిలో చాలభాగము స్వకృషివల్ల ధనసంపాదనను విరివిగ గావించుచునే యున్నారు. అయినను, విద్యావిహీనులగుటచే సదరు ద్రవ్యము సద్వినియోగబడక, వారు యభివృద్ధికి రాజాలకుండిరి; మరియు మామూలు స్థితిలోనే యుండుట సంభవించుచున్నది. వారికి విద్యావాసన, సత్సహవాసము లేని హేతువుచే, సదరు ద్రవ్యము వ్యర్థము చేయబడుచున్నది. మనదేశ జనాభాలో నూటికి డెబ్బది యైదుగురు వ్యవసాయదారులు. వారిలో కొద్దిమందిని మినహాయించితే మిగతా వారందరు విద్యా వాసనలేక దారిద్ర్యమువల్ల పీడింపబడుచునే యున్నారు. అదేవిధముగ పాటకపుజనులు సహితము వుండి యున్నారు. రహితులుగాని, పాటకపుజనులుగాని వారు సంపాదించిన ద్రవ్యమంతయును, యేవిధమైన దురభ్యాసములు లేక సంసారపోషణకుగాను మాత్రమే మితముగ వాడుచుండిన

పక్షమున, వారు ప్రస్తుతమున్న దుస్థితిలో నుండుట సంభవించక, ధనసంపన్నులై వివిధసౌఖ్యముల ననుభవించుచూ సుఖముగ కాలక్షేపము చేయుచుండెడివారు. అట్లుగాక, వారిలో పలువురు సంసారసంపన్నులై యుండి భార్యా, పిల్లలువగైరాలను పోషించవలసిన భారమును వహించియున్నను, వారి సంపాదన ద్రవ్యము తప్పితే వేరు జీవనోపాయము లేదని బాగుగ వారికి దెలిసియుండినను, సంపాదించిన ద్రవ్యమును సంసార పోషణకు వాడక, దుర్వ్యయమును గావించుచున్నారు. అట్లు జేయుట వల్ల దుర్వ్యయమును గావించిన వ్యక్తులు చిక్కులుపడుటయే గాక, వారి సంపాదనమీాద నాధారపడియున్న భార్యాపిల్లలు వగైరాలందరు తినుటకు అన్నములేక మలమల మాడవలసి వచ్చుచున్నది. దురభ్యాసములే దుర్వ్యయమునకు మూల కారణభూతము లగుచున్నవి.

## దురభ్యాసములవల్ల దుర్వ్యయము

మనదేశములో ప్రస్తుతము ప్రబలముగ వ్యాపించియున్న దురభ్యాసములలో ప్రాధాన్యమైనది త్రాగుడు. త్రాగుడు యనగా:—నిషా లేక మత్తునిచ్చు పదార్థములగు కల్లు సారాయి వగైరాలను త్రాగుట యని అర్థము. అట్టి త్రాగుడును నిర్మూలముచేసి మనదేశమునకు, మనదేశస్థులకు యార్థిక పరిస్థితులను చక్కపరచి సహాయము చేయవలయుననెడి సంకల్పముతో, ప్రభుత్వమువారు ప్రతిజిల్లాకు (temperance committee) మత్తుపదార్థముల వాడుకను నిషిద్ధపరచుటకు ఒక కమిటీని, సదరు కమిటీకి మెంబర్లను నియామకముచేసి ప్రియ

పడి తిప్పలుపడి యుండియున్నను, సదరు కమిటీమెంబర్లు జిల్లా లోని వివిధప్రాంతములకు ప్రయాణములను జేసి త్రాగుడు నిషిద్ధమునుగురించియు, అందువల్ల గలుగు వివిధయనర్థకములను గురించియు పలువిధముల ఉద్బోధనలను గావించి యుండియు న్నను, ఒకవైపున ప్రభుత్వ యారోగ్యశాఖవారు శరీర యారోగ్యమునకు త్రాగుడు చేటుగలిగించుననియు, త్రాగుడును మానవలసినదనియు, 'యారోగ్యవారము' (Health Week) లోను తదితర సమయములలోను బొమ్మలుగల పటములమూలకముగను, ఉపన్యాసముల మూలకముగను, పలువిధముల బోధనలను గావించుచున్నను, మరియొకవైపున సహకార ప్రభుత్వోద్యోగియులు, సహకారశాఖ యనుద్యోగియులు, సహకారసిద్ధాంతములకు ప్రాధాన్యమైన మితవ్యయమునకు త్రాగుడు పరమవిరోధియనియు, త్రాగుడు మూలకముగ సహకారోద్యమమునకు చేటు వాటిల్లుచున్నదనియు మ్యాజికులాంతరు ప్రదర్శనములవల్లను, సహకారసభలలో గావించు గంభీరోపన్యాసములవల్ల తేటతెల్లముగ తెలియపరచుచున్నను, మరియు ప్రజాక్షేమాభివృద్ధిని గోరు దేశాభిమానులు త్రాగుబోతుల కాళ్ళుచేతులను బట్టుకొని పలువిధముల బ్రతిమాలుకొనుచు, యెన్నివిధముల ప్రార్థించుచున్నను, భగవచ్చిత్రమేమోగాని, యాపాకారీపాటల మొత్తములా విశేషముగ తగ్గుటలేదు; త్రాగుడా దినదినాభివృద్ధిని బొందుచున్నది. ఒకవైపున ప్రభుత్వమువారు త్రాగుడుతాగిన వారిని శిక్షించుచున్నారు; మరియొకవైపున పలువురు పెద్దమనుష్యులు త్రాగుడుతాగిన వారిని ఛీ-ఛీ-యని తూలనాడు చున్నారు. ఇంటివద్ద భార్యా

పిల్లలు, అలో! లక్ష్మణా! యని ఘోరముగ నేడ్చుచున్నారు. ఇరుగు పొరుగువారందరు పలువిధముల వారిని దుర్భాషణ లాడుచున్నారు. వీటినన్నిటిని లక్ష్యముసేయక, మానాభిమానములను వదలి సిగ్గు భిడియములేక త్రాగుపోతులు యిల్లువాళ్ళు గుల్ల జేసుకొనుచూ, భార్యాపిల్లలను మలమలమాడ్చుచూ, మామూలు ప్రకారముగానే కాలక్షేపమును జేయుచుందురు. వారు సంపాదించు ద్రవ్యము కొన్ని సమయములలో వారి త్రాగుడుకు జాలక, దొంగతనము వగైరా యితర దురభ్యాసముల నభ్యసించుటను సహితము ప్రారంభించును. భార్య యోగ్యురాలైన పక్షమున, సంసారభారమును వహించి, భర్తయుండి యున్నను ప్రయోజనము లేదని భావించి, నడుముకట్టుకొని కూలినాలి చేయుటవల్ల ద్రవ్యసంపాదనను గావించి, పిల్లలను భర్తను పోషించు చుండును. మరియు పిల్లలు క్రమమార్గమున నడుచునటుల చూచుచుండును. వీలైనయెడల పిల్లలు విద్య నభ్యసించుటకు తగు యేర్పాటులను గావించు చుండును. ఇట్లు జరుగుట బహు యరుదు. భార్య యట్టి సమర్థురాలుకాని పక్షమున, యంతయు నాశనమే. సంసారమడుగంటియే పోవును. భార్యా పిల్లలు దుష్టవృత్తుల ననుసరించి దుర్మార్గులగుట సంభవించును. సదరు విధముగ దుర్మార్గులసంఖ్య యభివృద్ధిని బొందుచుండును. సత్ప్రవర్తనలేక దురభ్యాసముల నభ్యసించువారి యందరి సంసారములకు నిదియేగతి పట్టును. దురభ్యాసములు దుస్సాంగత్యమువల్లను బహుసులభముగ పట్టుపడగలవు. ఒకసారి పట్టుపడిన, తిర్గి వదలుట బహుకష్టము. పాటకజనులు ముఖ్య

ముగ శిల్పికారులు—మిల్లులలోను, మోటార్లలోను బనిజేయు వారు సామాన్యముగ నెలకు రు 20 లు మొదలు రు 50 లు వరకు జీతమునుగాని, కూలీఫీగాని సంపాదించు చుందురు. వారికిగల తెలివితేటలు—నిపుణత— యనుభవములను బట్టి, వారికిచ్చు జీతములుగాని—కూలీగాని యేర్పాటు చేయబడుచుం డును. చదువుకొన్న చిన్న వుద్యోగములనుజేయు పలువురి సంపాదనకంటె, వీరి సంపాదనయె బాగుగ యుండి యున్నది. సదరు సంపాదన ద్రివ్యముతో వారువారి కుటుంబములను బోషించుచూ సలక్షణముగ సంసారమును గడుపుచుండిన పక్ష మున, వారుగూడ ద్రివ్యమును మిగిల్చి దాచుకొనుట సంభ వింపవచ్చును. అయితే యట్లుజరుగక, బుద్ధిమంతులైన యే కొద్దిమందినో మినహాయించితే మిగతావారందరు కడు హీనస్థి తిలో నుండియున్నారని జెప్పుట యాశ్చర్యముకాదు. వారి సం పాదన ద్రవ్యములో వకవీసమైనను సంసారపోషణకు వచ్చునా యని సందేహామె! ఎప్పటికప్పుడు అట్టివారికి నప్పులనిచ్చిన వాళ్ళతోటె, భార్యాపిల్లలతోటె, యిరుగు పొరుగువారితోటె తగాదాలు పోట్లాటలు జరుగుచుండును. తండ్రి యింటికి వచ్చుచున్నాడని, పిల్లలు సంతసించి యెదురుగబోయి కౌగలిం చుకొనుటకు బదులు, ఝడిసి పారిపోయి దాగుకొనెదరు. సదరు విధముగ తాగ్రుబోతులు లోకకంటకులు లోకవిరో ధులు యగుట సంభవించును. తాగ్రుడు, జూదము, వ్యభి చారము దురభ్యాసములలో ముఖ్యములైనవి. ఈ మూడును పరస్పరాను రాగము గలవి యగుచూ సహకారులుగ ప్రివ ర్తించు చుండును. ఇంతవరకు ధనహీనులకు దురభ్యాసములు

యలవడుటవలన గల్గు నష్టములను గురించి విచారించితిమి.

ఈ దురభ్యాసములే ధనవంతులకు నావేశించిన పక్షమున, నతిచమత్కారముగ పనులు జరుగుచుండును. వాటి మహిమవలన, నేడు లక్షాధికారి రేపు బిక్షాధికారి యగుచుండును; నేడు ఖాజీ రేపు ఫాజీ యగుచుండును; నేడు మేడ, రేపు గుడిసె; నేడు పంచభక్ష్య పరమాన్నములు, రేపు గంజి కూడు; నేడు ముఖమల్ దుస్తులు, రేపు చీలికల పాతగుడ్డలు. కాలమహిమను తప్పించ యెరికిని శక్యముకాదు. అట్టివారికి స్వదేశములో తయారుచేయబడు సారాయి కల్లు వగైరాలు పనికిరావు. పరదేశములనుంచి దెప్పింపబడి విశేషవిలువగల, బుడ్లలోని, ద్రావకమునే వారు వాడుచుందురు. త్రాగి నిషాసమయములలో వారు ధనమును యేవిధముగ వాడుదురో, వారికి నగమ్యగోచరముగ నుండును. ఏవిధములైన నోట్లు వ్రాయబడుచున్నవో, యెవరివల్ల యేమి తీసుకొనిపోబడుచున్నదో, తెలియుట కవకాశముండదు. దురభ్యాసములలో బాగుగ ప్రవీణతగల్గి ప్రఖ్యాతి నొందినవారే అప్పటికాలములో వారికి ముఖ్యస్నేహితులుగ నుండుటకు నర్హులు; కాని యితరులకు వారి గుమ్మములో నడుగుబెట్టుటకు సహితము యోగ్యత యుండజాలదు. మరియు అట్టిసమయములో వారి కుటుంబమునందు గాని, వారియందుగాని విశ్వాసముగలవారు యెవరైనను వారిని (త్రాగుబోతులను) మంచిత్రోవను త్రిప్పుటకు ప్రయత్నములను సలిపిన పక్షమున, సలిపినవారు పలువురి హాస్యాస్పదమునకు పాత్రులగుటయేగాని వేరుప్రయోజనము కనబడజాలదు. కనుక త్రాగుబోతులకు త్రాగుబోతులే

సహవాసులు యగుదురు. వారందరు కలసి, బహు స్వల్ప కాలములోనే యున్నదంతయును సంపూర్ణముగ నాశనముగా వించి, మటుమాయమై పోవుదురు. "బాగుగ జూదమాడ గలవాడుగాని, బాగుగ గుఱ్ఱపుస్వారీ చేయగలవాడుగాని, బాగుగ చీట్లాడగలవాడుగాని, బాగుగ నృత్యముచేయగలవాడుగాని, బాగుగ వేటాడగలవాడుగాని, బాగుగ త్రాగగలవాడుగాని, లేక పై యన్నిగుణములుగాని, కొన్నిగాని గలవాడే ప్రస్తుతకాలములో పెద్దమనిషి (Gentleman) యని చెప్పబడుటకు నర్హుడు. మరియు యట్టి పెద్దమనిషికి సంబంధించిన విషయము లన్నియు బహుత్వరగనే జరిగిపోవు చుండును. అనగా వాని జీవితకాలము బహుత్వరగ జరిగిపోవును. వాని ధనము బహువేగముగ ఖర్చుపెట్టబడును. బహువేగముగ తాగును. బహువేగముగ జచ్చును," యని వక హూణ భాష గ్రంథకర్త వ్రాసియున్నాడు. అట్లే దురభ్యాసముల నభ్యసించు ధనవంతుల కార్యములన్నియు జరుగుచుండును. వారు చెడిపోవుటయే గాక, వారిమీద యాధారపడియున్న వారందరు చెడి దేశములోని బిక్షుకులసంఖ్యను వృద్ధిపరచుటకు సహాయపడుదురు.

నేను దురభ్యాసముల మహిమను వర్ణింపబూనుకొనుట పిచ్చితనముగ గనబడు చున్నది. ఇది కలియుగము. కలి మహాపురుషుని సహచరులే దురభ్యాసములై యున్నవి. అట్టివారి మహిమను చూచితీరవలయునేగాని వర్ణింపబూనుకొనుట హాస్యాస్పదముగ నుండును. ఏది యెట్లుండినను, దురభ్యాసముల వల్ల విశేష ప్రజలు దుర్గతిని బొందుచున్నారు. కలియుగ

మని యూరకుండుట ధర్మమా? మానుష ప్రయత్నములను సలిపితీరవలయును. తరువాత భగవదేచ్ఛ.

పాటకజనులు దురభ్యాసములకుగాను ద్రవ్యమును ఖర్చు పెట్టుటమాని, సంపాదన ద్రవ్యములో ప్రతిరోజు వక నాల్గు యణాలు చొప్పున దాచుకొనుచుండిన పక్షమున, సంవత్సరమునకు షుమారు ఒక వందరూపాయిలు తేలికగ సమకూరగలవు. అదేవిధముగ పదిసంవత్సరములు గావించిన పక్షమున ఒక వెయ్యిరూపాయిలు సమకూర్చబడును. అట్లుగావింపక పాటకజనులలో విశేషమంది వారి సంపాదన ద్రవ్యమంతయును దుర్వ్యయము పాలుచేసి, ధనహీనులై యష్టకష్టముల ననుభవించు చున్నారు. ప్రజలు దురభ్యాసములను కట్టి బెట్టి సత్ప్రవర్తనగలవారు అయినగాని సహకారోద్యమము వారికి సహకారికాజాలదు; కాని దేశమును-దేశస్థులను దినదినము యధోగతికి దెచ్చుటకు మాత్రము సహకారి యగుచుండును.

మానవులు సంసార పోషణకుగాను ప్రతిదినము కొంత ధనమును ఖర్చుపెట్టుట విధాయకమే. మరియు పాలనాధికారులు విధించు పన్నులు వగైరాలను సహితము క్రమప్రకారము యిచ్చుట విధాయకమే. మరియు యప్పుడప్పుడు సంసంభవించు శుభాశుభములకు యితర యత్యవసర ఖర్చులకు-యవసరములకు ననుగుణ్యముగ వాడుట సహితము విధాయకమే. పై విధాయక ఖర్చులన్నియు యిట్లుండగా, కొంత ద్రవ్యము వ్యక్తుల బద్ధకమువల్లను, మరికొంత ద్రవ్యము డాంబికమునకుగాను మరికొంత ద్రవ్యము తెలివితక్కువ వల్లను నష్టపెట్టబడుచున్నది. పై యవసరములను నష్టములన్నిటిని

కలుపుకొని విచారించినను, దురభ్యాసములు లేనియెడల మానవులు బాగుపడుట కవకాశము కలదు.

మానవుడు దురభ్యాసములకు కింకరులై యాత్మగౌరవమును,యింద్రియనిగ్రహశక్తిని కోలుపోవుచున్నారు. దురభ్యాసములకు నభ్యాసముగల మానవుడు, యెట్టి విద్యావంతుడైనను, యెట్టిపని నిపుణతగలవాడైనను, యెట్టి శక్తిసామర్థ్యములుగలవాడైనను, ప్రజలవల్ల గౌరవింపబడడు. అట్టి వాని మాటలకు విలువనివ్వక తృణీకరింపబడు చుండును. అట్టి వాడు నలుగురిలోనికి వచ్చుటకు సాహసించడు. అట్టి వానికి నేపని నప్పగింత చేయబడినను, ధ్వంసమే యగును. కావున యట్టివారు ప్రపంచకమునకు నిష్ప్రయోజకులు యగుట సంభవించు చున్నది.

ఇంతవరకు దురభ్యాసములుగల ధనవంతులు పాటక జనులు చేయు దుర్వ్యయములను గురించి విచారించి యుంటిమి. దురభ్యాసముల నభ్యసించకయే పలువురు దుర్వ్యయమును గావించుటగూడ గలదు. అట్టివారిని గురించి విచారింతము.

## —♦ దురభ్యాసములు లేని దుర్వ్యయములు ♦—

ధనహీనులైనను కొందరు డాంబికమునకుగాను-యాత్మగౌరవమునకుగాను భావించి, ఋణముదెచ్చి యైనను ధనమును వ్యయపుచ్చుచున్నారు. అట్లు చేయుటవల్ల ప్రస్తుతము లోకులవల్ల గౌరవింపబడుచూ పలువిధముల స్తుతింపబడుచున్నను, కొద్దికాలములోనే వాని నిజస్థితి బయలుబడుట సంభవించి, నానాయిడుముల పాలగుట సంభవించును. వారి నిజస్థి

తులు దెలిసినవారు వారి డాంబికమునకు వారి వెనుకనే వారిని పరిహాసము చేయుచుందురు. ఇది యిట్లుండ, ధనహీనులు వారి నిజస్థితిని బాగుగ గ్రహించి మితముగ ధనమును వాడు చుండిన పక్షమున, యిరుగు పొరుగువారు లోభియని పలువిధముల నిందించుదురు. ముఖ్యముగ శుభా శుభకార్యముల సందర్భములో లోకులకు వెరచి శక్తికి మించి పలువురు ధనమును వ్యయపరచుట సంభవించుచున్నది. " Big fool-the world." ,,లోకులు-కాకులు" అనగా ప్రపంచము తెలివి తక్కువది యని యర్థము. అట్టిలోకుల పరిహాసములను, నవ్వులాటలను పాటింపక, మన నిజస్థితుల ననుసరించి మనము ప్రవర్తించుటయే మనవిధాయకము. ఈలోకులే, రేపు మనము దుస్థితిలో నుండి చిక్కుల పాలగుచున్నపుడు, తిర్గి పరిహాసించుటకు సిద్ధమగుదురు. గనుక మానవులు యెల్లప్పుడు వారి స్థితిగతులను బాగుగ విచారించుకొని, వారి శక్తిసామర్థ్యములకు మించిన కార్యమును యెన్నడును జేయబూనుకొనరాదు. ,,కార్యము పట్ల తలవంచుకొనిన, తర్వాత తల యెత్తుకొని తిరుగవచ్చును," యని యొక లోకానుభవజ్ఞులు చెప్పియున్నారు. కావున కార్య సమయములలో శక్త్యానుసారము పనులను జరుపుచూ, యితరుల స్తోత్ర నిందలను బాటింపక గాలమును గడుపుటయే విధాయకము. లోకులను దృప్తిపరచుట దుర్లభము. వారి తృప్తికి నంతములేదు. కావున మానవులు యుక్తా యుక్త విచక్షణ కలవారై, తనయొక్కయు— తనమీాద నాధారపడియున్న వారి యొక్కయు మంచిచెడ్డలను బాగుగ విచారించు కొనుచూ, ముందాలోచనగలవారై కా

ర్యములను జేయుచుండుటయే శ్రేయోదాయకమగును కాని తనశక్తికి మించిన కార్యమును లోకుల తృప్తికిగాను జేయబూనుకొనుట యార్థిక శాస్త్రరీత్యా పిచ్చితనమని చెప్పవలసి వచ్చును.

ధనవంతులలో కొందరు, వారికి విశేష ధనముండిన కారణముచే, మితవ్యయ సిద్ధాంతములను పాటింపక శుభాశుభ కార్యములను జరుపుటలో గాని తదితర యవసరకృత్యములను నెరవేర్చుటలోగాని, యిచ్చవచ్చినట్లు వ్యయముచేయుదురు. అట్టివారు సహితము వచ్చురాబడికి మించి వ్యయమును చేయుచుండిన పక్షమున, త్వరలోనే వారిపేర్లు సహితము ధనహీనుల జాబితాలో జేర్చబడవలసి వచ్చును. అయినను వారు డాంబికమునకుగాను, దానకర్ణుడు—మహాధన వంతుడు-మహాభోగశాలి యని యితరులు తనను గౌరవింపవలయును యనెడి వుద్దేశ్యముతో విరివిగ విశేషధనమును కొల్లపెట్టుచుందురు. • వివాహకార్యములలో యల్లుడికిచ్చు కట్నములుగాని కానుకలుగాని, వియ్యపురాలు యాడబిడ్డలు వగైరాలకు ఇచ్చు కట్నములుగాని లాంచనములుగాని, వధూవరుల నూరేగింపులుగాని యసమానములై చూపరులకు విభ్రాంతిని గలుగజేయుచుండును. మరియు తల్లియొక్క—గాని తండ్రియొక్క—గాని మరణము సంభవించిన పక్షమున, బ్రాహ్మణులకు గోదానములా—షోడశ మహాదానములా—పండిత సంభావనలా—సంతర్పణలా మెగిరిపోవు చుండును; లోకోపకారమైన యేపనిని జేయ తలబెట్టినను, ముందు పెద్ద చందామొత్తము యితనిదె; బీదసాదలకు సంతర్పణలను జేయుటకుగాని

యితర విధముల సహాయమును జేయుటకుగాని, మొనకాడు యితడే అయియుండును; విద్వాంసులనుగాని సంగీతపాటకులను గాని, తదితర విద్యాప్రవీణులనుగాని, సత్కరించి బహుమాన ములిచ్చుటలో నితనే ప్రాముఖ్యతను వహించును. (ఇచట దురభ్యాసములు లేనట్టియు, మితవ్యయ సిద్ధాంతముల ననుస రించ నట్టియు ధనికుల ప్రవర్తనమును గురించి వ్రాయుచున్నా నని చదువరులు జ్ఞాపకముంచుకొన వేడుచున్నాను.) పై ఖర్చు మొత్తము లన్నియు వచ్చురాబడికి లోపుగనుండి మించని పక్షమున, యతను ధన్యుడేయగును; యతని జన్మసార్థకమగును. నిస్సందేహము. కాని యట్లుగాక మించిన పక్షమున స్వల్ప కాలములోనే ధనహీనత సంభవించి, యిడుములపాలగుట తట స్థించును. సత్కార్యములను జేయుచున్నను, దుష్కార్య ములను జేయుచున్నను, రాబడికి మించి ఖర్చుచేయు వ్యక్తి వృద్ధిలోనికి వచ్చుటకు నవకాశముండదు. గనుక ధనవంతులు చేయు వ్యయమునకు సహితము మితి, వారికి రాగల యాదా యమునకు మించకుండుటయే యని చెప్పవచ్చును. సామా న్యముగ వైద్యునికి ధనహీనులు వక రూపాయిగాని యిచ్చిన పక్షమున, యిచ్చినవారు పుచ్చుకున్నవారు పరమ సంతుష్టిని బొందుదురు. ధనికుల విషయములో నట్లు జరుగుటకు వీల గునా? ధనికులు వారిదర్జా ననుసరించి యిచ్చినగాని, వైద్యు డు సంతోషించుట సంభవింపదు; ధనికునికి సంతుష్టి కలుగదు. ధనవంతులకు, ధనహీనులకు ననసరములు వకమాదిరిగనే యుండును. కాని ధనహీనులు సల్వమొత్తములతో వారి యవసరములను దీర్చుకొనుట సంభవించును. ధనికులన్ననో

యట్టి యవసరములకై విశేష ద్రవ్యమును వ్యయపరచుట సంభవింపవలసి వచ్చును. కావున ధనికులు వారి యవసరములకు ననుగుణ్యముగను, వారికి రాగల యాదాయమునకు మించకుండగను వ్యయపరచుట నుచితమని చెప్పవచ్చును. ధనికులుచేయు ఖర్చులు కొన్ని తదితరులకు దుర్వ్యయముగ గనబడవచ్చును. కాని, వారి పరిస్థితులను ధనికుల పరిస్థితులతో పోల్చి చూచిన, ధనికులుచేయు ఖర్చుసహేతుకరముగనే కనబడుచుండును. వారు దురభ్యాసములకు లోనుగాకుండ వ్యయమును చేయుచున్నంతవరకు, మరియు వారి రాబడిని మించకుండ వ్రయమును జేయుచున్నంతవరకు, వారిని యాక్షేపించుటకు విశేషమవకాశ ముండజాలదు. అయినను, వారు సహితము ధనమున్నదని యనవసరపు ఖర్చులను జేయుటగాని, యవసరములకు మించి వ్యయమును జేయుటగాని, శ్రేయోదాయకము, లాభదాయకము, సౌఖ్యదాయకము కాజాలదు.

## — వివాహ కట్నములు —

దేశములో నాగరికత దినదినాభివృద్ధినిబొందుటకు ముఖ్యకారణములు, విద్యయు, ధనము లైయున్నవి. మరియు విద్యయు, ధనములే దేశౌన్నత్యమునకు మూలబీజములు. మన దేశములో విద్య యభివృద్ధినిబొందుచున్నను, ధనము మాత్రము దినదిన క్షయమును బొందుచున్నది. ధనము విరివిగగలవారు యేకొద్దిమందినో మినహాయించితే, తతిమ్మావారందరు ధనము నిమిత్తం అల్లాడువారేకాని మనస్థిమితముగ కాలక్షేపము చేయువారుకారు. ధనమును విరివిగ గలవారు ధనమును

విరివిగ వ్యయముచేయుటలో యాక్షేపణ యేమియు ఉండదు. ధనము విరివిగ లేనివారు సహితము ధనవంతుల మార్గములనే త్రొక్కుటకు నభిలషించుచూ, వారుచెడుటయేగాక వారితో సంబంధము కలవారిని సహితము చెరుచుట సంభవించుచున్నది. ప్రస్తుత దినములలో ముఖ్యముగ వివాహములు పలువురికి పలువిధము లైన చిక్కులను గల్గించుచున్నవి. వివాహసందర్భములో దరిద్రులా, క్షేమముగనే యున్నారు. అవసరమైనయెడల వారి యాడబిడ్డలను యే ముసలి (వృద్ధు) కో యమ్మి, సుఖముగ కాలక్షేపమును చేయుచుందురు. ధనవంతులా కోరిన కట్నముల నిచ్చి వరుని కొని మహావైభవముగ వారి యాడపిల్లల వివాహములను జేయుచూ సుఖముగ కాలక్షేపము జేయుచున్నారు. ఇక చిక్కులా మధ్యవారి పాలగుచున్నవి. ధనవంతులమాదిరిగ వివాహములను జరుపుటకా శక్తి లేదు. దరిద్రులమాదిరిగ జేయుటకా యిష్టము లేదు. దేశములో పెండ్లికుమారులా బహుప్రియముగ నమ్మబడుచున్నారు. కట్నములు, లాంచనములు ముందుగనే నిర్మొగమాటముగ బేరముచేసుకొనబడి నిష్కర్షచేసుకొనబడుచున్నవి. ఈ దురాచారము మాత్రము దేశములో విశేషముగ ప్రబలి, యాడపిల్లలుగలవారి సంసారములను ధ్వంసము గావించుచున్నవి. ధనముతో సంబంధించిన విషయముగనుక యీదురాచారమును నిర్మూలముజేయుటకు నెవరును మనస్ఫూర్తిగ కృషిసల్పుటకు వీలులేకున్నది. కట్నముల భయముతో వివాహములనుజేయ నసమర్థులు శారదాబిల్లునకు సహస్రసాష్టాంగ ప్రణామములను గావించుచున్నారు. కట్నములు

సహితము, భరించలేని వారికి దుర్వ్యయముగనే కనబడు చున్నవి.

దురభ్యాసములు, దురాచారములవల్ల విశేషముగ మానవులు పీడింపబడుచూ, ధనహీనతవల్ల కష్టములపాలగుచు న్నారు. క్రమక్రమేణ దరిద్రుల సంఖ్య హెచ్చుచున్నది. గనుకనే మన దేశము సహితము బీదదేశమని పిలువ బడవలసి వచ్చుచున్నది. మనదేశములో ప్రబలి యున్న దారిద్ర్య నాశనమునకు దోడ్పడుటకుగాను మితవ్యయ సిద్ధాంత ముల యాధారముమీద సహకారోద్యమము స్థాపింపబడియు న్నది. కాని మితవ్యయ సిద్ధాంతములు మాత్రము ప్రథమ మున విరివిగ ప్రజలమనస్సుల నాటునట్లు ప్రబోధము గావింప బడని హేతువుచే, ముఖ్యముగ మనరాజధానిలో సహకారో ద్యమము యితర కొన్ని రాజధానులలోవలె యభివృద్ధిని బొం దుటలేదు. పంజాబుదేశములో మితవ్యయమును ప్రజలకు యలవడునటుల జేయుటకుగాను, "సహకార మితవ్యయ సంఘములు" స్థాపింపబడి మహాజనోపయోగకరముగ బనిజే యుచున్నవి. పోస్టాఫీసులలోని సేవింగ్సుబ్యాంకులలో దాచుకొ ను సొమ్ములమీద నిచ్చు వడ్డీరేటుకంటె యధిక వడ్డీరేటు మిత వ్యయ సంఘములలో దాచుకొను సొమ్ముమీద నివ్వబడుచుం డును. ఇదియె పై సంఘముల ప్రధానసౌకర్యము అయి యున్నది. 1929 వ సంవత్సరములో 962 సంఘము లట్టివి 17,000 మెంబర్లతోను, రు 7.73 లక్షల చందామొత్త ముతోను పనిచేయుచున్నవి. వాటిలో 124 సంఘములు ప్రత్యేకించి స్త్రీలనిమిత్తం యేర్పడియున్నవి. మరియు సదరు

రాజధానిలోనే (Better Living Societies) ఉన్నతజీవితము నెల కొల్పుసంఘములు స్థాపింపబడి పనిచేయుచున్నవి. వాటి ముఖ్యోద్దేశ్యము శుభాశుభ కార్యముల సందర్భముల దుర్వ్యయమును తగ్గించుటయె అయియున్నది. కార్యయజమానులు సంఘము వారి సిద్ధాంతముల ననుసరించని పక్షమున, సంఘమెంబర్లు గాని, యిరుగుపొరుగువారుగాని, యట్టి కార్యములలో పాలుగొనుటకు నంగీకరించరు. సదరు సంఘములు బహుయద్భుతముగ పనులను జరుపుచున్నవి. 289 సంఘములు 11000 మెంబర్లతో 1929 వ సంవత్సరములో నుండియున్నవి. సదరు విధముగ పంజాబురాజధానిలో మితవ్యయము ప్రజలలో నలవడునటుల గావించుటకు యద్భుతప్రయత్నములు చేయబడుచున్నవి. మితవ్యయము సంపూర్ణముగ ననుష్ఠానింపబడిన దేశమే ధనవంతమైన దేశము కాగలదు. ధనవంతమైన దేశమె ప్రజలకు సౌఖ్యదాయకమైన దేశముకాగలదు. ప్రజలకు సౌఖ్యదాయకమైన దేశమె భూలోకస్వర్గమని పిలువబడుచుండును.

మితవ్యయము నభ్యసించుటకు మార్గములను గురించి విచారింతము.

## —♦ గృహములలో స్త్రీ ప్రాముఖ్యత ♦—

మనదేశ దుస్థితికి, యితరకారణములు కొన్ని యుండియున్నను, ముఖ్యకారణము మనము చేయు పనులే అయియున్నవి. సోమరితనమువల్లను—దుర్వ్యయమువల్లను—మత్తుపదార్థసేవవల్లను—దుష్ప్రవర్తనవల్లను మానవులు చెడుచు

న్నారు. మానవులు చెడుటయే దేశము చెడుటయగును. ఏకార్యము నైనను దూర దృష్టితోను, తెలివి తేటలతోను, పట్టుదలతోను గావించనిపక్షమున సదరు కార్యము జయప్రదము కాజాలదు. ప్రజలు వున్నతస్థితిని బొందజాలరు. మన దేశములోని కొందరు పాటకజనులు విరివిగ ధనసంపాదనను గావించుచున్నారు. వర్ష కాలములో నుపయోగం నిమిత్తం చీమలు—కావలసిన యాహారపదార్థములను వేసవికాలములోనే సంపాదించి దాచుట మనము చూచుచునే యున్నాము. అటు వలెనే, పాటకజనులు—తదితరులు సహితము భగవంతుడు దయతో నొసంగిన దూరదృష్టి జ్ఞానముతో దాచుచు సంసారములను గడుపుచుండిన పక్షమున, నిస్సందేహముగ దేశము నకు మహోపకారమును గావించినవారు కాగలరు. సంసారమును క్రమముగ నడుపుటను సంబంధించిన ముఖ్య విషయములన్నిటిని విద్యవల్లగాని, లేక యనుభవమువల్లగాని, ముందుగ తెలిసికొనుట విధాయకము. ప్రతి సంసారము నకు పురుషుడు స్త్రీ యిద్దరు యవసరమె. లోగడ చెప్పిన ప్రకారము గృహకృత్యములను క్రమముగ జరుపు భారము అంతయు స్త్రీలమీాదనే యుండును. ధనమార్జనజేయు భారము పురుషులమీాద నుండును. 32769

సంసారములో స్త్రీల బాధ్యతలను గురించి విచారింతము. సర్వసామాన్యముగ గృహములు స్త్రీల యాజమాన్యము (అజమాయిషి) క్రిందనుండును. గృహములు అందరికి పవిత్రములైన స్థలములు. గృహములు విద్యనభ్యసించుటకు ప్రధానస్థానములు. గృహములలో బిడ్డలు పుట్టిపెరిగి పురు

షులు స్త్రీలుగ పరిణమించుచున్నారు. గృహములలోనే పిల్లలు నీతిదాయకమైనట్టి గుణములను యభ్యసించుచున్నారు. గృహములలోనే పిల్లలు లోకవ్యవహార జ్ఞానమును సంపాదించి కృతార్థులగుచున్నారు. గృహములలోనే మానవులు వారి భవిష్యత్ వృత్తులను స్థిరపరచుకొని, వాటికి ననుగుణ్యాముగ జ్ఞానమును సంపాదించు చున్నారు. గృహయజమానురాలు సమర్థత, సత్ప్రవర్తనగలది అయినపక్షమున పైనచెప్పిన ప్రికారము జరుగుటకు నవకాశము గల్గుచున్నది. అట్లుకానియెడల అంతయు వ్యతిరేకముగ జరుగుచుండును.

మరియు, పాఠశాలలలో పిల్లలకు విద్యమాత్రిము మంచిక్రమమైన పద్ధతులమీాద నేర్పబడు చుండును. కాని వారి ప్రివర్తనను గురించి విచారించుటకు పాఠశాలాధి కారులకు తగు యవకాశముండ జాలదు. ఈ పని తల్లిదండ్రులదే అయియున్నది. గృహములలో తల్లి యాజమాన్యముక్రింద పిల్లలు సత్ప్రవర్తనను యభ్యసించుదురు. తల్లి సత్ప్రవర్తన కలది అయిన పక్షమున పిల్లలు సహితము సత్ప్రవర్తన కలవారై ప్రిఖ్యాతిని బొందుదురు. కావున తల్లి ప్రివర్తన మీాద పిల్లల ప్రివర్తన సహితము యాధారపడి యుండును. కావున స్త్రీలు సత్ప్రవర్తన కలవారై, యుక్తా యుక్త విచక్షణ కలవారై, గృహసంబంధమైన విషయములు అనగా పరిశుభ్రిత, పొదుపు, పాకముచేయుట వగైరాలను గురించి పరిపూర్ణజ్ఞానము కలవారై యుండినగాని, గృహములు సౌఖ్యదాయకములు, నీతిదాయకములు, జ్ఞానదాయకములు కాజాలవు. గృహములకు పరిశుభ్రిత ముఖ్యావశ్యకము. గృహ

ములను పరిశుభ్రముగ నుంచుటకుగాని, పిల్లలను పెంచుట కుగాని, పాకమును జేయుటకు గాని యారోగ్యశాస్త్ర పరిజ్ఞానమును కొంతవరకైనను కల్గియుంచుట స్త్రీలకు నావశ్యకము. గృహపరిశుభ్రతకు ముఖ్యవిషయములు:—

(1) ఇంటియొక్క ప్రతిభాగమునకు వెలుతురు బాగుగ చొరవలసి యుండును. చీకటి భాగములు వుండకూడదు. చీకటి వుండిన పక్షమున, తేమ, అశుభ్రత, అందువల్ల పురుగులు, దోమలు వృద్ధియగుచుండును.

(2) పరిశుభ్రమైన గాలి వీచుచుండవలయును. వెలుతురువలెనే గాలి సహితము ఇంటియొక్క ప్రతిభాగములోనికి వీచుచుండవలయును. అనుకూలమైన కిటికీలు, దర్వాజాలు వుండిన పక్షమున, గాలి విరివిగ వీచుటకు వీలగును.

(3) ఇంటియొక్క క్రిందిభాగము అనగా నేల యెన్నడు తేమగ నుండకూడదు. తేమగనుండిన పక్షమున, తేమపురుగులు, దోమలు వగైరాలు పుట్టుటకు కారణమగుటయేగాక, పెద్దలకు చిన్నలకు నారోగ్యము చెడి జబ్బులపాలగుట సంభవించును. కావున నేలభాగము యెల్లప్పుడు పొడిగ నుండునటుల దగుయేర్పాటులను గావించవలసి యుండును.

(4) మలమూత్రవిసర్జనముగాని, యింటిలోని చెత్త, మురికినీరు, వగైరా (Refuse) పారపోయుటగాని, యింటికి దూరప్రదేశములలో గావించు చుండవలయును.

(5) ఇంటిలోని పరికరములన్నియు పరిశుభ్రముగ నుంచబడవలయును. మరియు యింటిలో ప్రతివస్తువును దాని నియామక స్థలములోనే నుంచుచుండవలయును. అట్లు చేయుటవల్ల

యిల్లు చిన్నదిఅయినను పరిశుభ్రముగాను విశాలముగాను కనబడుచుండును.

(6) త్రాగుడునీరు పరిశుభ్రమైన పాత్రలలో నుంచబడి వాడబడుచుండవలయును. గాలి, నీరు యారోగ్యమునకు ప్రధాన విషయములు.

స్త్రీలు పై విషయములన్నిటిని బాగుగ గమనించుచూ, గృహములను పరిశుభ్రముగ నుంచిన పక్షమున, అట్టి గృహములలో నివశించువారందరు యారోగ్యవంతులగుటయేగాక, సంసారము సహితము పొదుపుగను, సలక్షణముగను జరుగుటకు వీలగుచుండును. మరియు పసిపిల్లల యకాలమరణములకుగాని, పిల్లల యొక్కయు పెద్దల యొక్కయు యనారోగ్యమునకు గాని, గృహముల నశుభ్రతయే ముఖ్యకారణము అయియున్నది. గనుక యట్టివి తగ్గుటకు సహితము సహాయపడుచుండును. ముఖ్యముగ, స్త్రీలు యింటిలోని ప్రతివస్తువును దాని నియామకస్థానములో నుంచుచూ, ప్రతికార్యమును దాని నియామక కాలములో గావించుచుండిన, కాలము కలసి వచ్చుటయేగాక, పలువిధములైన సౌకర్యములు సహితము కల్గుచుండును. పురుషులకు కాలము యెంత విలువగల్గియుండునో, స్త్రీలకు నంతకంటె కాలము యెక్కువ విలువకల్గియుండును. సంసారమును క్రమముగ నడుపు స్త్రీలు ఒకనిమిషమైనను వ్యర్థబుచ్చుటకు నవకాశముండదు. పలువిధములైన జ్ఞానమును సంపాదించుచుండవలయును. పలువిధములైన సంసార సంబంధపు పనులను నెరవేర్చు చుండవలయును. ప్రతి నిమిషము వారికి విలువగనే కనబడుచుండును. తీరుబడి సమ

యములలో సంసారపోషణకు లాభదాయకములగు పనులను, అనగా రాటము, కవ్వములతో పనులనుగాని, కుట్టుపనిని గాని, మంచి గ్రంధములను పఠించి జ్ఞానమును వృద్ధిపరచుకొనుటనుగాని, చేసుకొనుచుండ వలయును. "రాటము కవ్వము యాడుచోటు దారిద్ర్యము వుండజాలదు" అను నార్యోక్తి ననుసరించి వాటిని విడుచుట ధర్మముకాదు. ఇరుగు పొరుగు వారితో ముచ్చటలాడుచూ వృధాకాలయాపనమును జేయుటవల్ల, ననర్థకములేగాని వేరు లాభముండజాలదు. కావున స్త్రీలకు కాలము బహు విలువగలది అయి యున్నది. వ్యర్థ బుచ్చుట తగదు.

స్త్రీల చాకచక్యము మూలముగనే గృహములు పరిశుభ్రమునకు పుట్టినిల్లుగను, సుఖమునకు ప్రధానస్థానముగను, దయాదాక్షిణ్యములకు జన్మస్థానముగను, వివేక జ్ఞానములకు మూలపీఠముగను, చేయబడుచున్నవి. పిల్లలు తల్లి పోషణ క్రింద శూరులుగను, వీరులుగను, జ్ఞానసంపన్నులుగను, దేశోద్ధారకులుగను, పతివ్రతాశిరోమణులుగను చేయబడుచున్నారు. పిల్లలు యెల్లప్పుడు పరిశుభ్రమైన దుస్తులను ధరించి, శుభ్రముగ కనబడునట్లు చేయుభారము తల్లిదె అయియున్నది. తల్లులు సహితము మంచివస్త్రములను ధరించి పరిశుభ్రముగ కనబడుచుండవలయును. మరియు భర్త సాయంత్రమునకు, తనపనులను ముగింపుచేసుకొని యింటికి వచ్చుసరికి, చిరునగవు ముఖముతో నాదరించు భార్యాను, యారోగ్య సుఖవర్చస్సులతో నాడుకొను పిల్లలను, యన్నిటికంటె యెక్కువ స్వర్గతుల్యసౌఖ్యముల నిచ్చు గృహమును జూచి, పరమానందమును

బొందుటకు సందేహముండునా? పగలంతయుబడిన యాయాస మంతయు క్షణములో నశించిపోయి హాయిగనుండుట సంభవించును. ఇదియంతయు స్త్రీల మహిమకాదా? స్త్రీలు యోగ్యమైన సత్ప్రవర్తన కలవారు, జ్ఞానసంపత్తి కలవారు, కృషి సలుపు స్వభావముకలవారు అయినపక్షమున, దేశక్షేమము కరతలామలకము కాగలదు. వారు కని పెంచుపిల్లలే రేపు దేశోద్ధారకులు కాగలరు. పై గుణములు యబ్బునటుల జేయుటకు స్త్రీలకు విద్య యావశ్యకము. అట్టివిద్య ప్రస్తుత దినములలో బాలికలకు పాఠశాలలలో విరివిగ జెప్పబడుచునే యున్నది.

సద్గుణములులేని స్త్రీలు గృహిణులుగ నుండుట సంభవించిన, యట్టిగృహములు యమకూపములనియె చెప్పబడవచ్చును. ఎటుచూచినను, దుర్మార్గమె ప్రబలుచుండును. సదరు స్థితిగతులను వర్ణించుటకు నిందవకాశము చాలదు.

తుదిమాట :— స్త్రీల ప్రవర్తనమీాద పురుషుల ప్రవర్తన యాధారపడి యుండును. కుటుంబములో స్త్రీలు సత్ప్రవర్తన కలవారై, గృహకృత్యములను యథావిధిగ నెరవేర్చుచుండిన పక్షమున, పురుషులు సహితము దురభ్యాసములకు లోనుగాక సత్ప్రవర్తన కలవారై, గృహములలోనే సకలవిధ సౌఖ్యములను యనుభవించుచూ హాయిగ కాలక్షేపమును చేయుచుందురు. కొన్ని సమయములలో పురుషులు యేకారణముచేతనైనను దురభ్యాసముల నభ్యసించియున్నను, స్త్రీల సత్ప్రవర్తనమూలకముగ త్వరలోనే పురుషులు వారి చెడుబుద్ధిని మరల్చుకొని, క్రమమార్గమున నడుచుటనుగూడ

మనము చూచుచున్నాము. అట్లుగాక, కుటుంబములోని స్త్రీలు మంచివారు కానిపక్షమున, పురుషులు సహితము యిల్లుపట్టక నానాదురభ్యాసములకు లోనగుచూ, కాలమును దుర్వ్యయపరచుచూ, జన్మను ముగింతురు.

స్త్రీలు శక్తిస్వరూపులు; భగవంతుడు సహితము శక్తి (మాయా) సహాయము లేనిది సృష్టిని చేసియుండలేదు. అట్లే మన సంసారచక్రములో సహితము స్త్రీల సహాయము లేనిది పురుషులు సంసారములను క్రమముగ జరుపజాలరు.

విద్యయుండినగాని, స్త్రీలకుగాని పురుషులకుగాని సద్గుణములు యబ్బవు. సద్గుణములు యబ్బినగాని మితవ్యయము యలవడదు. మితవ్యయము యలవడినగాని, సంసారములు బాగుపడి, పురుషులు స్త్రీలు సుఖముగ కాలముగడుపుటకు వీలుపడదు. పురుషులు స్త్రీలు సుఖముగ నుండినగాని, దేశమునకు క్షేమము కలుగజాలదు. దేశము క్షేమముగ నుండినగాని, విద్యయొక్క వాణిజ్యముయొక్క యితరవృత్తులయొక్క నభివృద్ధి కాన్పింపదు. గనుకనే విద్య మితవ్యయమునకు మూలాధార మగుచున్నది.

## దేశములో పాటకజనుల ప్రాముఖ్యత

పాటకజనులు యనగా, శరీరయవయవములతో విశేషముగ కష్టపడు జనులు యనగా, వ్యవసాయదారులు, శిల్పికారులు, మిల్లులువగైరాలలో కూలీవగైరా పనులను జేయువారు, చిల్లరపనులకుగాను కూలీచేసుకొనువారు యని సామాన్యముగ వాడబడుయర్థము; మనోబుద్ధుల సహాయము

లేనిది శరీరయవయవములతో మాత్రము యేపనియు చేయ బడజాలదు. అయితే పాటకజనులకు మనోబుద్ధుల సహాయము విశేషముగ నవసరముండదు.

ధనికులు మాత్రము పాటకజనుల సహాయము లేనిది ఒకక్షణమైనను వారి వివిధ వ్యాపారములను నిర్వర్తించుటకు సమర్థులు కాజాలరు. ప్రతి దేశములోను, ఆయా దేశక్షేమము ఆయా దేశములోని పాటకజనుల మీదనే యాధారపడియుండును. దేశములకు ముఖ్యజీవనాధారమగు పంటలను పాటకజనులే పండించుచున్నారు.

దేశములో గృహములు, యితర కట్టములు, రోడ్లు, కాలువలు, వంతెనలు వగైరాలు (ప్లానులు యెస్టిమేట్లు యితరులవల్ల తయారుచేయబడు చుండినను) పాటకజనులవల్లనే తయారుచేయబడు చున్నవి. ప్రభుత్వమువారు యేర్పర్చిన పటాలములలో గాని, ఓడలమీదగాని, పోలీసుశాఖలో గాని, తదితరశాఖలలోగాని, పాటకజనుల సహాయము లేనిది పనులు సలక్షణముగ సాగజాలవు. మనము ప్రతిదినము త్రాగు పాలు, తినుకూరలు, మనకుగావలసిన బట్టలు, బుట్టలు, చీపిళ్లు వగైరాలన్నియు పాటకజనుల వల్లనే సిద్ధపరచబడు చున్నవి. ధనికులు ద్రవ్యమును ఖర్చుపెట్టి విశేష విలువగల మిల్లులు వగైరాలను కట్టించినను, వాటిలో బనిజేసి వ్యాపారమును సాగించుటకు దోడ్పడువారు విశేషము పాటకజనులే అయియున్నారు. (వివిధ ప్రాంతములలో పాటకజనుల సమ్మెలను గురించి వార్తాపత్రికలలో వినుచుండుటలేదా?) ధనికులు ధనమును విరివిగ ఖర్చుపెట్టదలచినను, బుద్ధిమంతులు బుద్ధిని

విశాలముగ విడజల్లుచున్నను, పాటకజనుల సహాయములేనిది వారి పనులు నెరవేరజాలవు. ప్రతిరాష్ట్రములోను పాటకజనులు ముఖ్యాంగమై ప్రధానస్థానమును వహించి యున్నారు. అట్టి వారు క్షేమముగ నుండినగాని, సదరు రాష్ట్రమునకు క్షేమము కలుగజాలదు. మన ప్రభుత్వమువారు, వారి స్వదేశములో పాటకజనుల రక్షణకుగాను పడుచున్న వివిధ శ్రమలను గురించి మనము వినుచునే యున్నాము. వాటిని వివరించుటకు నవకాశముచాలదు. మరియు మనదేశములో సహితము సహకారోద్యమమును పాటకజనుల సహాయార్థమే ప్రభుత్వము వారు నెలకొల్పియున్నారు

ఇతరదేశములలో వలె, మనదేశములో పాటకజనులు విశేషముగ యభివృద్ధిలోనికి వచ్చుటలేదు. అందుకు విద్యావిహీనతయే ముఖ్యకారణ మగుచున్నది. విద్యావిహీనతయే దుస్సాంగత్యమునకు కారణ మగుచున్నది. దుస్సాంగత్యమె దురభ్యాసములకు గారణమగుచున్నది. దురభ్యాసములే దుర్వ్యయమునకు కారణమగుచున్నవి. దుర్వ్యయమే, దారిద్ర్యమునకు కారణమగుచూ వారి యభివృద్ధిని నాటంకపరచుచున్నది.

ముఖ్యముగ మనదేశములోని పాటకజనులలో పంచములు, యెరుకలు, యానాదులు వగైరాలు కడు దుర్భరమైన హీనస్థితిలో నుండియున్నారు. సామాన్యముగ వారు కాపురముండు ప్రదేశములకు సామీప్యములోనే సారాయి, కల్లు యంగళ్లు వుంచబడును. కావున పైవారు సంపాదించు ద్రవ్యమంతయుగాని విశేషభాగముగాని త్రాగుడు నిమిత్తమె ఖర్చు పెట్ట బడుచుండును. అందుచేత వారు, వారి

కుటుంబములవారు మెల్లప్పుడు జ్యేష్ఠాదేవి పుత్రులై నానా యిడుములఁ బొలగుచుందురు. ఈతెగలవా రందరు సామాన్య ముగ దృఢశరీరులై, ధైర్యసాహసములు కలవారై పలువిధ ముల బాటుబడుటకు శక్తిసామర్థ్యములు కలవారై యుందురు. ఇంతేగాక పాటకజను లందరు తదితరులకంటె పాటుబడుటకు నెక్కువ శక్తి సామర్థ్యములు కలవారై జనులకు పలువిధముల నుపయోగబడుచూ, లాభములను గావించుచున్నారు. ఇత రులు యనుభవించు సుఖములన్నియు పాటకజనులు సల్పు కృషిమీదనే యాధారపడి యున్నవి. మానవుల శరీరములు క్రమముగ నిలువబడి వివిధకృత్యములను గావించుటకు, దృఢ మైనట్టియు, క్రమమైనట్టియు పాదములు యేవిధముగ నవస రమో, య దేవిధముగ ప్రతిదేశము వాటి విద్యుక్తధర్మములను క్రమముగా నాచరించుటకు, దృఢమైనట్టియు యారోగ్యమైన ట్టియు పాటకజనులు ముఖ్యావశ్యకము. వారు క్రమమైన స్థితిలో నుంచబడి, వారి యోగక్షేమము యన్నివిధముల విచా రింప బడుచుండిన పక్షమున, యట్టి దేశములు సదా క్షేమము గాను, నిర్భయముగాను, సుఖముగాను, కాలక్షేపము జేయు టకు నవకాశము కల్గుచున్నది.

మనప్రభుత్వమువారి దేశములో పాటకజనులు విశేష సంఖ్యాకులు విద్యావంతులు అయిన కారణముచే, కొన్ని సమయములలో (Labour Party) వారివల్ల పార్లమెంటులోని ప్రధాన స్థానములు యాక్రమించబడి వారి దేశముయొక్కయు, మన దేశముయొక్కయు పరిపాలన వారి హస్తగతమై, రెండు దేశములవారు వారి దయకు పాత్రులగుట సంభవించుచున్నది.

ప్రారంభమున పాటకజనప్రవృత్తిని యవలంబించియున్నను, కాల క్రమేణ బుద్ధిసూక్ష్మతతో విద్య నభ్యసించి, వృత్త్యుత్కృష్టపద వులను బొందుట సంభవించుచుండెను. అట్టి దశ మనదేశ మునకు సహితము నెప్పుడు సంభవించునో భగవదాజ్ఞ తెలి యకున్నది. అప్పుడుగాని పాటకజనులు సంపూర్ణముగ బాగు పడుటకు నవకాశములు కలుగజాలవు. అప్పుడుగాని మన దేశములోని దురభ్యాసములన్నియు బలాత్కారముగ నిరో ధింపబడుటకు వీలు కలుగజాలదు. అప్పుడుగాని దేశములోని క్షామ, దారిద్ర్యములు కొంతవరకు నాశనము కాజాలవు.

ప్రపంచములోని మానవులందరు యాశాపాశబద్ధులై కాలమును గడుపుచున్నారు. అట్టి యాశకు మితిలేదు. సమి ధలను అగ్నిహోత్రములో నేయుచున్నకొలది, యేవిధముగ నగ్నిహోత్రుడు విస్తరించి ప్రజ్వరిల్లుచుండునో, అదేవిధముగ యాశలను దీర్చుచున్నకొలది, ఆశలు ప్రబలి మిక్కుటమగు చుండును. కావుననే శ్రీకృష్ణభగవానులు 'నిరాశీవి కమ్మ' యని చెప్పియున్నారు. నిరాశిత్వము యనగా వున్నదానితో దృప్తిని బొందుట అనగా సంతుష్టి సంతృప్తియని యర్థము చెప్పవచ్చును. అట్టి తృప్తిని కల్గియుండుట దేవతాసంబంధ మైన గుణమును కల్గియుండుట యనిగూడ చెప్పవచ్చును. *ఈ సద్గుణమును మనదేశములోని పాటక జనులు కొంత వరకు ననుష్ఠాన మందుంచుచున్నారని నుడువుటకు నవకా శము కల్గుచున్నది. కొన్ని యితరదేశములలోవలె మన దేశ ములోని పాటకజనులు ఆశాపిశాచబద్ధులై, స్వధర్మమైన పాట

*ఈవాక్యములు హాస్యభావముతో ప్రోత్సాహపరచుటకు వ్రాయబడినవి.

కవృత్తిని విడనాడి, విద్య నభ్యసించి పుత్కృష్టగౌరవ పదము లను బొందుటకు తిప్పలుపడుట విశేషముగలేదు. వారు పాటకవృత్తితోనే, స్వల్పసంపాదన ద్రివ్యముతోనే సదా సంతుష్టిని బొందుచూ మనస్సులకు లేనిపోని వ్యాకులతను కలుగనీయక మనశ్శాంతినిబొందుచూ సుఖముగ కాలమును గడుపుచుందురు.* అట్లుగాక నితరదేశములలోని పాటకజనులు స్వధర్మమైన పాటకవృత్తిని యవలంబించుచున్నను, తృప్తిని బొందక యెక్కువధనమును సంపాదించుటకు సదా మార్గములను వెతుకుచుందురు. మామూలు ప్రకారము పాటకవృత్తిని జేయుచూ, తీరుబడీసమయములలో విద్య నభ్యసించుటవలన జ్ఞానమును వృద్ధిపరచుకొనుచూ, తద్వారా యధిక సంపాదనను గావించుచూ, తుట్టతుదకు వారు సల్పు కృషిమూలకముగను, వారి తెలివితేటలు మూలకముగను, మహోత్కృష్టమైన పదవులను బొందుటకు ప్రయత్నములను సలిపి జయముచు బొందుచున్నారు.

మరియు సంతుష్టి సోమరిబద్ధకులకు సహితము సహజమైన గుణము. ఒళ్లు వంచి పనిచేయలేక వారు సంతుష్టిని బొందుదురు. మనదేశములోని పాటకజనుల సంతుష్టి సదరు విధముగ పరిణమించుచున్నదని కొందరి యభిప్రాయము. ఏ పరిస్థితులలోనైనను మానవులకు సంతుష్టి గలిగినపక్షమున, యభివృద్ధికి రాజాలరు. మనదేశములో పాటకజనుల సహాయములేనిది పనులేమియు జరుగనేరవని పలువురికి బాగుగ యనుభవమువల్ల దెలిసియున్నను, సాంఘికరీత్యా

*ఈవాక్యములు హాస్యభావముతో ప్రోత్సాహపరచుటకు వ్రాయబడినవి.

పాటకజనులు యాక్రమించుచున్న స్థానమును విచారించినపక్ష మున, కడు విచారకరముగ నుండకమానదు. అందుకు కర్తలు పాటకజనులె. వారు సహితము సంఘములో వారిస్థితిగతు లను బాగుగ విచారించి తెలుసుకొని, యసంతృప్తిని బొంది చక్కపరచుకొనుటకు ప్రియత్నించినగాని, వారి స్థితిగతులు బాగుపడజాలవు. అసంతృప్తి కలిగినగాని, మానవులు వారి పరిస్థితులను చక్కపరచుకొనుటకు, ఉత్సాహముతో పనులను జేయబూనుకొనరు. అసంతృప్తి కలిగినగాని, మనస్సుకు శాంతి కలుగక యత్యాతురతతో కార్యదీక్షనుబూని పనిచేయ నారం భించరు. అట్టి యసంతృప్తి బాగుగ పాటకజనుల హృదయ ములలో యింకను ప్రజ్వరిల్లలేదు. వారిలో విశేషమందికి విద్య లేకపోవడము, సత్సహవాసము లేకపోవడము, దురభ్యా సముల నభ్యసించడము వారి ప్రస్తుత దుస్థితికి కారణములు. వారి హృదయములలో నసంతృప్త్యాగ్ని బాగుగ ప్రజ్వరిల్లినపక్ష మున, పైవిషయములన్నియు నిమిషములో మటుమాయమై పోయి, వారు సహితము యితరదేశములలోవలె వృద్ధిలోనికి వచ్చుట సంభవించి దేశౌన్నత్యమునకు పాటుబడుటకు సహా యభూతులు కాగలరు. విశేష పాటకజనులకు విద్యావాసన లేమిచే, వారి విధాయకధర్మములు వారికి బాగుగ దెలియుటకు నవకాశములేదు. అందువల్ల అట్టివారితో సంబంధముకల వారిపనులు సహితము క్రమముగసాగక నష్టపడుట సంభవించు చున్నది.

ఏది యెట్లున్నను, పాటకజనులు దేశమునకు దేశస్థులకు ముఖ్యావశ్యకులు. కావున వారి యభివృద్ధి నిమిత్తం వారే

పాటుబడుట విధాయకమని తదితరు లూరకుండక, వారి యభివృద్ధి నిమిత్తం పాటుపడుచూ, వారికి జేయూత నొసంగుట మన దేశౌన్నత్యమునకు ముఖ్యవిధాయకమై యున్నది ఇదియే నిమ్నజాత్యుద్ధరణము యని పిలువబడు చున్నది. ఇందుకుగాను పలువురు దేశభక్తులు ముఖ్యముగ గాంధిమహాత్ముడు వగైరాలు, మన ప్రభుత్వమువారు, పలువిధముల పాటుపడుచనే యున్నారు. ప్రభుత్వమువారు నిమ్నజాతుల వారికి (Depressed classes) విద్యాసందర్భములోగాని, యార్థిక సందర్భములోగాని పలువిధముల సౌకర్యములను గావించుచూ వారి యభివృద్ధికి దోడ్పడుచున్నారు. (Labour Department) పాటకజనుల సౌకర్యములను విచారించుటకుగాను ప్రత్యేక శాఖను నియమించి పరిపరివిధముల సహాయమును గావించుచున్నారు. భగవత్కటాక్షము యింకను సంపూర్ణముగ వచ్చియుండలేదు. పాటకజనులకు సహితము విద్య విశేషముగ నొసంగబడినగాని, వారు దురభ్యాసములను దురాచారములను మాని శ్రీమమార్గముల నడుచుటకు నవకాశము లుండజాలవు. విద్యయే మానవులకు నజ్ఞానాంధకారమును మాయము జేయుటకు దీపమువంటిది. విద్యయే దుర్మార్గులను సన్మార్గమున నడుచునటుల జేయుటకు దివ్యౌషధము వంటిది. విద్యయే మానవుల యిహపర సౌఖ్యములకు ప్రాధానబీజము వంటిది. విద్యయే దేశమునకు దేశస్థులకు సకలవిధ సౌకర్యములను గలుగజేయుటకు మహామంత్రము వంటిది. కావున విద్యను దేశములోని మానవులకు విరివిగ నొసంగినగాని, దేశము క్షేమముగ నుండజాలదు. దేశస్థులు దురభ్యాసములులేక ప్రవర్తిం

చుటయే దేశము క్షేమముగ నుండుటకు కారణమగును.

మితవ్యయము నభ్యసించుటను, పురుషులకుగాని స్త్రీలకుగాని విద్య ముఖ్యావశ్యకము.

## — సత్సహవాసము —

మానవులకు విద్యయుండి యున్నను, సత్సహవాసము (అనగా సత్ప్రవర్తన గలవారితో సహవాసము) లేనియడల జెడుటకు గారణమగును. విద్యలేకపోయినను, సత్సహవాసమున్నయెడల మానవులు బాగుపడుటకు యవకాశము కల్గుచున్నది. సత్సహవాసమును గురించి మూడవ యధ్యాయములో కొంతవరకు వ్రాసియుంటిని. "ఏవాడ చిలుకకు ఆవాడ పలుకు" యను సామెత ననుసరించి, సన్మార్గులతో సహవాసము చేయువారు సన్మార్గముల నవలంబించి సన్మార్గులే యగుచున్నారు. దుర్మార్గులతో సహవాసము చేయువారు దుర్మార్గముల నవలంబించి దుర్మార్గులే యగుచున్నారు. సామాన్యముగ పాటకజనులు వగైరాలలో కొందరు, వారి తీరుబడి సమయములలో రామమందిరములలోగాని దేవాలయములలోగాని భజనలను సల్పుచూ, లేదా హరికథాకాలక్షేపములకు వెళ్లి వినుచూ, వీధులలో సామాన్య జనోపయోగము నిమిత్తం ప్రదర్శింపబడు నాటకములను జూచుచూ, బొబ్బిలి మహారాష్ట్ర వగైరా దేశములలోని మహావీరులయొక్కయు, పతివ్రతాశిరోమణులయొక్కయు చరిత్రలను వినుచూ కాలమును సద్వినియోగ పరచుచుందురు. కొందరు యనవసరమైన ముచ్చట లాడుచూ, యనవసరమైన కయ్యాములకు

కాలుదుర్విన్యేచూ, లేదా నిష్ప్రయోజనమైన వినోదములతో నానందించుచూ కాలము దుర్వినియోగపరచుచుందురు. కాని ముఖ్యముగ పాటకజనులు విద్యావంతులతోగాని–ధనవంతుల తోగాని, క్లబ్బులలోగాని, మతసంబంధమైన–సాంఘికసంబంధ మైన సంఘములలోగాని, తదితర స్థలములలోగాని, కలసిమెలసి తిర్గి, అట్టివారి సత్సహవాసముతో నబ్బు గుణములను నభ్య సించుటకు ప్రయత్నములను సలుపుట బహుయరుదు. పాటక వృత్తినే యవలంబించి జీవనముచేయువారిలో నెట్టి నిపుణతగల వారు, విద్యావంతులు వుండియున్నను, సాంఘికరీత్యా వారు ఉన్నతపదవికి వచ్చుట సంభవించుటలేదు. మరియు మనదేశ ములోని పాటకజన సంఘములో కొందరు యనవసరమైన ట్టియు, దుర్వ్యయమునకు గారణమగునట్టియు, నాగరికత పోక ళ్ళను విశేషముగ నవలంబించుచున్నను, సాంఘికరీత్యా మా త్రము వారి స్థితిగతులు (Local status) యభివృద్ధికి వచ్చు టకు వీలులేక మామూలు దుస్థితిలో నుండుటయే సంభవిం చుచున్నది. క్లబ్బులలోగాని, తదితర సంఘములలోగాని ప్రవేశించుటవలన, సత్సహవాస మబ్బుటయేగాక, లోక సమాచారములు, దేశ పరిస్థితులు, మత సంబంధమైన ట్టియు సంఘసంబంధమైనట్టియు, నీతిదాయక మైనట్టియు, జ్ఞాన దాయకమైనట్టియు వివిధ విషయములు తెలియుటకు నవకాశ ముకల్గి జ్ఞానాభివృద్ధి యగుచుండును. ఏదియెట్లున్నను, మా నవులు వారి పరిస్థితులను చక్కపరచుకొని యభివృద్ధిని బొందు టకు కృషిసల్పినగాని, దేశము ఉన్నతస్థితికి రాజాలదు. మాన వులు యభివృద్ధిలోనికి వచ్చుటకు ముఖ్య సాధనము సత్సహ

హాసమే. సత్సహవాసము, దురభ్యాసములు లేనట్టియు, కృషిసల్పు స్వభావము గలినట్టియు, సత్ప్రవర్తన గలినట్టియు, వారితో కలసి మెలసి యుండుటవలన సులభముగ జేకూరగ లదు. అట్టి సత్సహవాసమె యిహపర సౌఖ్యములను గల్గించుటకు ముఖ్యకారణమగును. ‹‹సత్సహవాసమే మితవ్యయమునకు మార్గదర్శి యగుచుండును.”

## —♦ అరువులు ♦—

అరువులమూలకముగ పలువురు జనులు చెడుటకు గారణమగుచున్నది. వ్యాపారము చేయువారు లాభములేనిది యే పనిని జేయనొల్లరు. వ్యాపారములో గల్గు లాభమువల్లనే వారు వారి జీవనమును జరుపవలసియున్నది. మరియు వారి సంసారములో కల్గు శుభాశుభములు-రోగములు-అద్దెలు-పన్నులు నష్టములు వగైరా ఖర్చులన్నియు, వ్యాపారములోగల్గు లాభమువల్లనే సద్దుకొనవలసి యుండును. మరియు వారు పెట్టుబడి పెట్టిన సొమ్మునకు వడ్డీని సహితము మినహాయించవలసి యుండును. కావున వర్తకుడు యేవస్తువునైనను యమ్మిన పక్షమున, సదరు వస్తువు ఖరీదుకు ననుగుణ్యముగ, లాభము ఖర్చులు—వడ్డీ ఖరీదులో కలసియున్నవనియె భావించవలసియుండును. మరియు సదరు వస్తువునే యరువుకు యమ్మిన పక్షమున, యావస్తువు ఖరీదు పైకము జమకు వచ్చువరకు షుమారు వడ్డిసహితము యావస్తువు ఖరీదుతో కలుపబడియుండుట విధాయకము. అనగా బజారుధరకంటె ప్రియముగ యమ్మబడుచుండును; లేదా వర్తకుడు నష్టపడవలసి వచ్చును. అయి

తే కొందరు వర్తకులు యరువుకు నమ్మె వస్తువులకు బజారు ధర కంటె యెక్కువధరను జెప్పిన పక్షమున, కాతాదారులకు కష్టముగ నుండునని దెలుసుకొని, బజారు ధరకే కావలసిన వస్తువులను యిచ్చుచూ, అందువల్ల వారికి గల్గు నష్టమునుగాని, కొన్ని సమయములలో నంతకంటె యెక్కువనుగాని, తూనికలలోనో, కొలతలలోనో, సరుకు రకములోనో, కూడ దీయుచుందురు. కొందరు వర్తకులు అరువు మొత్తమునకు వడ్డీని కట్టి వసూలుచేయు చుందురు. అరువుబేరము సామాన్యముగ వర్తకులకు లాభదాయకము; కొనువారికి నష్టదాయకము. మరియు యీనష్టమొకటి మాత్రమేగాదు; మంచి వస్తువులు సహితము యివ్వబడవు. మామూలు వర్తకుడు తప్పితే మరివకరు యరువు నిచ్చుటకు సామాన్యముగ నంగీకరించడు. గనుక మామూలు వర్తకుడు యిచ్చుపదార్థముతో (మంచిదిగాని చెడ్డదిగాని) సంతుష్టిని బొందవలసి యుండును. ఇవియన్నియు యట్లుండ మరివక ముఖ్యవిషయమును గురించి గమనించవలసియున్నది. అరువుబెట్టి వర్తకులవద్ద సామాగ్రిలను గొనుట ప్రారంభించిన పక్షమున, యవసరబేయవసరములను బాటింపకయే, సామాగ్రిలు కొనబడుచుండును. వాడబడుచుండును. తుదకు బిల్లు మొత్తమును చూచుకొనినపుడు, గుండెబాదుకొనవలసి వచ్చును. మరియు, యరువుమొత్తము పెరిగినకొలది, కాతాదారుడు వర్తకునికి వశకరుడై స్వతంత్ర్యమును గోలుపోయి, అతనిచ్చు పదార్థములను అతడుచెప్పు ధరలకు పుచ్చుకొనుచు కాలమును గడుపుట సంభవించును. ఇంతవరకు అరువులు పుచ్చుకొను వారిని

గురించి వ్రాసియుంటిని.

అరువులనిచ్చు వర్తకుల పరిస్థితులను గురించి విచారింతము; సామాన్యముగ వర్తకము చేయువారిలో విశేషమంది వారి సరుకులనన్నిటికిని ముందుగనే వాటి ఖరీదును సరిపెట్టరు. సరుకులిచ్చు పెద్దవర్తకునికి, ఖరీదులో కొంత పైకమును రొక్కముగా నిచ్చి, మిగతా పైకమును వాయిదాలప్రకారమిచ్చుటకు నేర్పాటు చేసుకొనును. అదేప్రకారము పైకమును చెల్లించుచూ, పరపతిని నిలుపుకొనుచూ, వ్యాపారమును సాగించుచుందురు. అట్టి షరతులతో దెచ్చి వ్యాపారము జేయుచున్న వర్తకులవద్ద లోకులు యరువుల బేరమును జేయుచున్న పక్షమున, వర్తకుల స్థితి యెట్లుండునో కొంచెము విచారించవలసి యుండును. కొట్లో సరుకులు ఖర్చుయగుచుండును. లక్ష్మిప్రసన్నమా సున్న. ప్రారంభమున యనుకొన్న వాయిదాల ప్రకారము పైకమును చెల్లించుట తప్పదు. అట్లు చేయనిపక్షమున పరపతి పోవుటయేగాక, వర్తకము సహితము స్థంభించిపోయి యాపబడవలసివచ్చును. పైకమును పట్టాయించుచుండిన గాని, అనగా త్రిప్పుచుండిన గాని, వ్యాపారము సాగదు. అరువులు తుదకు పరపతికి చేటును గల్గించును. పరపతికి చేటుగల్గిన వ్యాపారముసాగదు. వ్యాపారమును యరువుల బేరముతో జేయు వర్తకునియొక్కయు, వ్యాపారమును రొక్కబేరముతో జేయు వర్తకుని యొక్కయు బొమ్మలతో పటములు యమ్మబడుచుండును. అరువుల వర్తకుని యినుపపెట్టెలో ఖాళీగానుండుటచే యెలుకలు దూరుచున్నట్లున్నూ, రొక్కపువర్తకుని యినుపపెట్టెలో రూ

పాయిాల సంచులు మూాలుగుచున్నట్లున్నూ పటములో వ్రా యబడి యున్నది. కావున అరువులతో వ్యాపారము విశేష లాభదాయకముయని నుడువుటకు నవకాశము కనుపించదు. అరువుబాకీలలో నెన్ని పారుబాకీలు తేలునో యెవరు ముం దుగ జెప్పగలరు. కావున అరువుపద్ధతి, అరువు యిచ్చినవా రికి, పుచ్చుకొనినవారికి నష్టదాయక మగును. కావున యే వస్తువును గొనదలచినను యమ్మదలచినను, రొక్కమునకే గొనుము-అమ్ముము. అరువునకు గొనవద్దు-యమ్మవద్దు; యను సిద్ధాంతము యేర్పడుచున్నది. ధనముండిన యవసరమునకు ననుగుణ్యముగ వాడుము; లేదా మానుము. ఈ సిద్ధాంతము లను యవలంభించిన, చాల సంసారములు బాగుపడగలవు. అరువులు దుర్వ్యయమును జేయుటకు ప్రోత్సాహ పరచుచుం డును. కావున యరువుగ గొనుటను కట్టిబెట్టి, వున్నదానితో వాడుకొనుచూ, సంసారమును గడుపుచుండుట పలువిధముల లాభకారి కాగలదు. " అరువులు లేకపోనిడము మితవ్యయ ము నభ్యసించుటకు సహకారి యగుచుండును. "

## — అ ప్పు లు —

అప్పులు యరువులకంటె బహుత్వరలో వ్యక్తుల పరిస్థితులను జెరుపుటకు దోడ్పడగలవు. అప్పుమొత్తములు వడ్డిమూలకముగ దినదినాభివృద్ధిని బొందుచుండును. స్థితిపరులకు నప్పుల నిచ్చుటకు షాహుకారు వెనుకయంజ వేయడు. కాని యాస్తిపరులు మాత్రము పుచ్చుకొనదలచిన యప్పు యేవిధముగ త్వరలో దీర్చబడగలదు యను విషయమును మాత్రము బాగుగ ముం

దుగ నాలోచించి, విధమును స్థిరపరచుకొని, యప్పుచేయుట లాభదాయక మగుచుండును. అట్లు చేయనియెడల, ఋణ వంతునియొక్క ఋణమొత్తము దినదినాభివృద్ధినిబొంది, తుద కు ఋణవంతునియొక్క యాస్తి క్రిమక్రిమేణ క్షీణించుట సం భవించును. సదరు విధముగనే పలువురు ధనవంతులు చెడు టకు గారణమగుచున్నది. మరియు లాభములను గల్గించు పనుల నిమిత్తం ఋణములను జేయుటలో దోషము లేదు. వ్యవసాయ ఖర్చులనిమిత్తం యప్పు జేసినపక్షమున, పంటలు పండడముతోనే ధాన్యమును యమ్మి, నచ్చిన పైకముతో ఖర్చులనిమిత్తం చేసిన యప్పును దీర్చగా మిగిలినపైకము లాభమగును. అట్లే శిల్పికారులు యమ్మకము నిమిత్తము సామగ్రిలను తయారుజేయుటకు యప్పుచేసిన పక్షమున, సామ గ్రిలు యమ్మబడగా వచ్చిన పైకములోనుంచి యప్పును దీర్చితే, మిగిలినది లాభమగును. ద్రవ్యము లేనివారు యిట్టిలాభ దాయకములైన పనులకు నప్పులను జేయుటలో దోషములేదు. మరియు యిట్టిపనులకు సహాయమును జేయుటకే సహకార సంఘములు స్థాపింపబడి పనులను జరుపుచున్నవి. సంసార ములో సంభవించు శుభాశుభకార్యములు, తదితర యవసర ములు లాభదాయకమగు కార్యములు కాజాలవు. కావున వాటి నిమిత్తం చేయబడిన యప్పులు, ప్రతిదినమున సంసార ము నిమిత్తంచేయు ఖర్చులుపోను మిగిలిన యాదాయ మొత్త ముతో దీర్చబడవలసి యుండును. విశేషముగ రాబడి గల వారికి యట్లుజేయుట సాధ్యమగు చుండును, మరియు యను కూలమగు చుండును. కాని స్వల్పయాదాయపరులకు మాత్రి

ము యట్టి యప్పులు చిరకాలమువరకు దీర్పబడక, వడ్డీతో పెర్గి పెర్గి తుదకు నప్పుచేసిన వానిని ముంచివేయును. కావున నేకార్యమునైనను, శక్తికి మించిచేయక చేతిలో హాజరుగ నున్న పైకముతోనే జరుపుకొనుట పలువిధముల సౌకర్యములను గలుగజేయును; మరియు సుఖముగ గాలక్షేపమును జేయుటకు సహకారికాగలదు. ‹‹ పరుగెత్తి పాలుత్రాగుటకన్న, కూర్చుని నీరుత్రాగుట సుఖదాయకమగును. ›› కావున సాధ్యమైనంతవరకు నప్పులను జేయుట మానుటయే విధాయకము. అంతగా జేయవలసిన పక్షమున సదరు యప్పునుదీర్పు మార్గమును ముందుగ నిశ్చయపరచుకొని జేయుట మధ్యమపక్షము. ఎట్టి ముందు విచారణలేకయే యప్పును జేయుట యధమపక్షము. ఇట్టి యప్పులే మానవులను యధోగతిపాలుకు దెచ్చుచున్నవి. ఒక పర్యాయము యప్పుచేయ రుచిమరిగినవాడు, తదితర స్వవిషయములను గురించి విచారించకయే యప్పులను చేయుచుండును. అట్టి యప్పులమూలకముగ మితవ్యయసిద్ధాంతములను మరచుట సంభవించును; మరియు స్వతంత్రమును గోలుపోవుట సంభవించును; ఋణదాతలకు వశీకరులగుట సంభవించును. కావున సదా ఋణములు మానవులకు ననర్థదాయకములు; మానవుల క్షేమమునకుగాను నిరుత్సాహ పరచబడవలసిన విషయము. ‹‹ అప్పులను జేయకపోవుట సహితము మితవ్యయము నభ్యసించుటకు ముఖ్యమార్గమే యగును. ››

—♦ జమ ఖర్చు లెక్కవ్రాయుట ♦—

ప్రతిమానవుడు వానికివచ్చు యాదాయముయొక్కయు చేయుఖర్చుయొక్కయు లెక్కను తప్పీలుగా వ్రాయుచుండ వలయును. అట్లుచేసినపక్షమున, సంసారయార్థిక పరిస్థితులు యెప్పటికప్పుడు స్పష్టముగను, వివరముగను దెలియుటకు నవ కాశముగల్గుచుండును. అందువల్ల యవసరమునుబట్టి ఖర్చులో తగు హెచ్చుతగ్గులను జేయుచూ సంసారమును గడుపుచుండ వచ్చును. గనుక "జమఖర్చు లెక్కనువ్రాయుట మితవ్య యము నభ్యసించుటకు మార్గములలో నొకటి."

—♦ సొమ్మును నిలువచేయుట ♦—

ప్రతిమానవుడు యతనుచేయు సంపాదన ద్రవ్యములో అనగా జీతములోగాని, కూలీలోగాని, తదితరయాదాయ ద్రవ్యములోగాని, కొంతమొత్తమును మిగిల్చి వాడుకొనుట వల్ల అట్టివారికి యవసర సమయములలోగాని, కష్టసమయము లలోగాని, సదరుపైకము యనేకవిధముల దోడ్పడగలదు. పైవిధముగ స్వల్పజీతగాండ్రుగాని, స్వల్పకూలీమొత్తమును సం పాదించువారుగాని జేయుట సాధ్యమగునాయని కొందరు సందే హింపవచ్చును. అట్టివారు వారి స్వల్పసంపాదన మొత్తము లతో వారిసంసారములను జరుపుటలేదా ? కడుపునిండ భుజించి కాలక్షేపము జేయుచున్నారా ? కావున కష్టములో కష్టమని భావించి, యారోగ్యముగ దిరుగుచున్నప్పుడే నిలువచేయని పక్షమున, తదుపరి చిక్కులు పడవలసివచ్చును యనిగూడ దెలుసుకొని, సంపాదించిన ప్రతిరూపాయికి వకకాని చొప్పున

మిగిల్చి దాచుకొనుచుండిన పక్షమున, కొంతకాలము గడిచే సరికి వకపెద్దమొత్తము యేర్పడును. అట్టిమొత్తము ధనవంతు లకు హీనముగ గనబడవచ్చునుగాని, పైవారికిమాత్రము గొప్పదిగ కనబడితీరును. పలుదినములనుంచి కడుపుకట్టుకొని దాచినసొమ్ముగాని. వేరుకాదు. అట్టిసొమ్ము వారికి బహు ప్రియముగనుండుట సహజము. సదరుసొమ్మును యంతను గాని, కొంతనుగాని శుభాశుభములకు లేక యితర యత్యవసర ములకు వీలునుబట్టివాడుటకు వీలగుచుండును. పై సందర్భములో నిట్టిపైకము లేనియెడల డబ్బుదొరకకనానాగడ్డి తినవలసివచ్చును. రూపాయివకటికి యరువదిమూడు కానులేయని భావించి, ఖర్చు యవసరమున్నను, ఖర్చుజేయక నిబ్బంది పడియైనను, కొంత పైకమును మిగిల్చి దాచుట ప్రతిమానవుని యొక్క ముఖ్య విధాయకము అయియున్నది. ఈ సిద్ధాంతము ననుసరించియే, ఉద్యోగస్థుల సౌకర్యము నిమిత్తం కొన్ని ప్రభుత్వముల వారు సహితము రూపాయివకటికి వకయణా చొప్పునయున్నా, చిన్న జీతములుగల వుద్యోగస్థులకు రూపాయి వకటికి రెండు కానులు చొప్పునయున్నా, ప్రతినెల జీతములలోనుంచి మిన హాయించి దాచుచుందురు. అట్లు దాచబడిన మొత్తము Provident fund యని పిలువబడు చుండును. సదరు మొత్త మునకు వడ్డీతో, Fund నిబంధనల ననుసరించి ప్రభుత్వము వారొసంగు యదన పైకముతో, వుద్యోగస్థుడు వుద్యోగ మును మానుకొనినపుడు యావత్తుపైకము సదరు వుద్యోగస్థు నికి నివ్వబడును. ఈ విధముగానే ప్రజాపాలన శాఖలలోని వుద్యోగస్థులకు సహితము వారి సౌకర్యము నిమిత్తము చేయ

బడుచున్నది. "Provident" అను మాటలో 'ముందుకు దాచుట' యను యర్థము యిమిడియున్నది. చేతిలోనున్న పైకముతోనే సంసారమును గడుపులకు కొన్ని సమయములలో కొన్ని చిన్న యవసరములను మానుకొని యిబ్బంది పడవలసి వచ్చును. ముందు సుఖమునకుగాను యట్లుజేయుట సహేతుకరముగనే యుండును. చిన్న చిన్న మొత్తములను ముఖపు పెట్టెల మూలకముగ సులభముగ ఇళ్ళలోనే దాచుచుండ వచ్చును. మొత్తము పెద్దదిఅయినకొలది, పోష్టలు సేవింగ్సు బ్యాంకులలోగాని, సహకార సంఘములలో డిపాజిట్లు మూలకముగగాని, దాచుకొనుచుండ వచ్చును. సహకార సంఘములలో నిట్టి చిన్న మొత్తములను స్వీకరించుటకు పలువిధములైన యేర్పాటులు గావింపబడి యున్నవి. విశేషము యవియన్నియు స్వల్పసంపాదనపరులకే ననుకూలముగ నుండును. కావున సొమ్మును నిలువచేయుట సహితము మితవ్యయ మభ్యసించుటకుగల మార్గములలో ప్రాధాన్యమైనది."

—♦ స్వల్పవిషయములని, నిర్లక్ష్యము చేయరాదు ♦—

కొందరు సంసారసంబంధమైన గాని, వ్యాపారసంబంధమైనగాని, తదితర సంబంధమైనగాని పెద్దపెద్దవ్యవహారములలో స్వయముగ కృషిసల్పుచూ, కడు జాగరూకతతో ప్రవర్తించుచుందురు. చిన్నవిషయములన్నియు తదితరులకు వప్పగింతచేయబడును. చిన్నవిషయములలో యశ్రద్ధయే కొన్ని సమయములలో గొప్పనష్టములను గల్గించుటకు కారణభూతములగుచుండును. కావున చిన్న పెద్దయనుభేదము లేకుండగ,

యన్నివిషయములను గురించియు సకాలములో దగిన జాగ్రత్తను వహించినగాని, వ్యవహారములన్నియు సక్రమముగ సాగజాలవు. విశేషమువిలువగలవి కావని దమ్మిడీలను నిర్లక్ష్యముచేసిన పక్ష మున, రూపాయిలు నష్టమగును; దమ్మిడీలే రూపాయిలగు చున్నవి. ఒకసమయములో వకతోటగేటుబందు క్రమముగ త్వరలో మరమ్మతు చేయబడనిహేతువుచే, యితర పశువులు ప్రవేశించి తోటలోని చెట్లను ధ్వంసముచేసి పలువిధములైన నష్టములను గావించినవి. బందుకు మరమ్మతు మూడునాల్గు యణాలతో సులభముగ జేయబడియుండును. నిర్లక్ష్యముచేత యాలస్యము చేసినందువల్ల విశేషనష్టమును యనుభవింపవలసి వచ్చినది. అట్లె వకప్పుడు వకరిపెట్టెయొక్క తాళమును మర మ్మతు చేయించనిహేతువుచే పెట్టెలోని గాగితములు పిల్లల వల్ల నాటలనిమిత్తం వాడబడి, విశేషనష్టముకల్గుట సంభవించి నది. తాళము మరమ్మతు ఒక అణాడబ్బులతో సులభముగ జర్గియుండును. అశ్రద్ధయె ఈనష్టమునకుగూడ కారణము. మరియొకచోట పైకము వసూలువిషయమై సకాలములో దగు చర్యను జరుపని హేతువుచే, విశేష నష్టమును బొందుట సంభ వించినది. ఇందులకు నజాగ్రత్తయె గారణము. ఇట్టివి యనేక దృష్టాంతములు వుండును. కావున గృహయజమాని, యజయూనురాలు సహసాత్తులై వారికి సంబధించిన యన్ని చిన్నపెద్ద విషయములను దగుజాగరూకతతో జూచుచూ, అశ్రద్ధ జేయక సకాలములో వ్యవహారములను నడుపుచుండ వలయును.

"నేడే జేయగల్గెడి పనులను నేడే జేయవలెరా,
రేపగు, రేపగు అనుచును అవసు, రేపుచురాగల యిక్కట్లెన్నో"

యని లోకానుభవజ్ఞులు వ్రాసియున్నారు.

ఇంటిలోని పరికరణములన్నిటిని (చిన్న—పెద్ద) పదిలపర చుకొనుచూ, వాడుక అయిన వెంటనే యథాస్థానములందుం చుచూ, తినుబండారు వస్తువులు వగైరాలను పారుపోసీయక జాగ్రత్తగ వాడుచూ, సంసారమును గడుపు స్త్రీలు ప్రతిసం సారమునకు నత్యావశ్యకము. "స్వల్పవిషయములను సహితము లక్ష్యభావముతో జూచుట, మితవ్యయము నభ్యసించుటకు మార్గములలో నొకటి అయి యున్నది."

## —♦ మొగమోటము ♦—

కొందరు మానవులు మొగమోటమువల్ల జెడుచున్నారు. స్నేహితులుగాని, బంధువులుగాని, తదితరులుగాని యడిగిన, యాచించిన ధన సహాయమును, లేదనలేక, కాదన లేక, చెడుచున్నారు. బెల్లమున్నంతవరకు చీమలుండును యనునట్లు, ధనమున్నంతవరకు స్నేహితుల సంఖ్యకు బంధువుల సంఖ్యకు మితముండదు. వారిస్తుతి భూషణములకు నంత్య ముండదు. కాఫీ సమయములలోను, భోజన సమయముల లోను, టిఫిన్ సమయములలోను యతిధి స్నేహితుల సంఖ్య దినదినాభివృద్ధిని బొందుచుండును. బెల్లము అయిపోవడముతోనే, చీమలన్నియు మటుమాయమై పోవును. అట్లే ధనము అంతమును బొందడముతోనే, స్నేహితులు, బంధువులు అందరు యంతర్ధానమై పోవుదురు. ఎక్కడనైన కనబడినను, నిరాదరణ భావముతో జూతురు. కావుననే మానవులు, ధనమునుజూచి కాకులలాగు పోగుయగు స్నేహితులను బంధువు

లను విశ్వసించక దగు జాగ్రత్తతో యార్థిక వ్యవహారములను నడుపుచుండవలయును. 'నిర్మొగమోటముగ, లేదు—కాదు, అని చెప్పుటకు సాహసించవలసి యుండును. " అప్పుడే మితవ్యయము యబ్బగలదు.'"

—♦ షోకులు ♦—

భగవంతుడు మానవులకు దయతో నొసంగిన యందమునకంటె, యెక్కువ దెచ్చిపెట్టుకున్న యందము 'షోకు' యనబడును. (షో—కు) 'షో' అనునది హూణభాషమాట అనగా కనపర్చడము అని యర్థము. 'కు' నిమిత్తమని యర్థము. కావున షోకు యనగా కనపర్చడము నిమిత్తము యని యర్థము. ఉన్నదాని కంటె నెక్కువగ కనపర్చడము నిమిత్తం జేయబడున దంతయు షోకు యని పిలువబడుచుండును.

పలువురు పలువిధములైన షోకులకుగాను ద్రవ్యమును వ్యయపరచుచున్నారు. కొందరు (Dress) ధరించు దుస్తులు వగైరాలకు యమిత ద్రవ్యమును వ్యయపుచ్చుచున్నారు. మరికొందరు పలువిధములైన గృహోపకరణములను గొన వాంఛించుచున్నారు. మరికొందరు పలువిధములైన గుర్రములను—యెద్దులను—బళ్లను—యావులను—కుక్కలను గొన నభిలషించుచున్నారు. మరికొందరు పలువిధములైన భోజనపదార్థములను గోరుచున్నారు. మరికొందరు పెద్దగృహములనుగట్టి యానందించుచున్నారు. సదరు విధములుగ కొందరు యవసరములకంటె నెక్కువగ ధనవ్యయమును గావించుచున్నారు. పై విధముగ ధనవంతులు వారిరాబడికి లోపుగ ఖర్చు చేయు

చున్నంతవరకు, కొంతమట్టుకు నిరాక్షేపణీయమునుయని చెప్ప వచ్చును. కాని సామాన్యజనుల విషయములో, యనవస రమైన వస్తువులను వారి శక్తికి మించి గొనుట మాత్రము హా స్యాస్పదముగ గనబడుటకు సందేహ ముండజాలదు. మరియు మితవ్యయ సిద్ధాంతములకు విరుద్ధమని చెప్పవలసివచ్చుచున్నది.

దేశములో నాగరికత ప్రబలుచున్నకొలది, పట్టణము లలోగాని గ్రామములలోగాని, పాటకజనులు కొందరు ధన ముండినను లేకపోయినను, దారుఢ్యవంతులు అయినను కాక పోయినను, కొందరి ధనవంతులయొక్క పోకళ్లను మాత్రము యవలంబించుచూ స్వయముగ కృషి సలుపుటకు నిచ్ఛగిం చక యుండియున్నారు. అందువల్లనే కూలీలసంఖ్య దినదినా భివృద్ధిని బొందవలసిన యవసరము కల్గుచున్నది. పూర్వపు రోజులలోకంటె ప్రస్తుత దినములలో వ్యవసాయపు ఖర్చులు గాని, యితరపనుల సందర్భములో కూలిఖర్చుగాని, యధిక ముగ నగుటకు నిదియే కారణము. ప్రస్తుతపు దినములలో యెట్టి చిన్నపనికి అయినను కూలీ కావలసి వచ్చుచున్నది. ఒం టికి చెమటపట్టి తొడుగుకున్న తెల్లచొక్కా నల్గి మాసిపోవు నను భయముచేత కొందరు, ఫ్యాషనుగ దువ్వుకున్న తల వెంట్రుకలు చెదరిపోవుననే భయముచేత కొందరు దేహపరి శ్రమకు నొల్లకున్నారు. ఈవిధముగ పాటకజనులు కొందరి వల్ల కొంత ధనము దుర్వినియోగ పరచబడుచున్నది. మరియు పూర్వము లేని కొన్ని యలవాట్లు మూలకముగ ( సిగరెట్లు, బీడీలు, కాఫీ, సోడా ) కొంతధనము దుర్వ్యయ మగుచున్నది. దేశములోని వృద్ధులు యింకను పూర్వాచారపరాయణు లై

యుండియున్నను, యౌవనమందు వున్నవారు మాత్రము పలు
వురు ప్రస్తుత నాగరికత పద్ధతులను యవలంబించి కొంత
వరకు దుర్వ్యయము గావించుచున్నారని చెప్పవలసి వచ్చు
చున్నది. అట్లు గావించుట వారికి శ్రేయోదాయకముగాక
పోగా, మితవ్యయ సిద్ధాంతములకు ననుగుణ్యముగ లేదనిగూడ
నొక్కి వక్కాణించుటకు నవకాశము కల్గుచున్నది. సాధ్య
మైనంతవరకు నట్టి యభ్యాసములను విసర్జించుటయె యుచి
తము; దేశమునకు, దేశస్థులకు క్షేమము.

## —♦ భగవద్భక్తి ♦—

ప్రారబ్ధమనియు, దురదృష్టమనియు, కర్మఫలమనియు పలువురు పలువిధముల, వారుచేయు పనులు జయప్రదము కానపుడు చెప్పుచూ నిరుత్సాహులగుట సంభవించుచున్నది. కార్యదీక్షతో జేయబూనుకొనిన కార్యములు సఫలము కావడము మానవులు సల్పుకృషి ననుసరించి యుండునుగాని, పైవిషయములమీద నాధారపడి యుండవు యని కొందరి పారిశ్రామికుల యభిప్రాయము అయియున్నది. మరియు త్రికరణశుద్ధిగ—అనగా మనస్సుతోను, వాక్కుతోను, కాయముతోను యేపనిని అయినను పట్టుదలతో జేయబూనినపక్షమునయావని సఫలము కాకమానదు యని సహితము కృష్యారాధనపరుల యభిప్రాయము అయియున్నది. కృషిని సలుపవలసినవారి నుత్సాహపరచు చుండినగాని కార్యము లుత్సాహముతో జేయబడజాలవు.

‘‘షడ్భాగంతు మనుష్యానాం సత్తమం దైవచింతనం,’’

అనునట్టియు, "దైవంచైవాత్రపంచమం" అనునట్టియు శాస్త్ర ప్రమాణముల ననుసరించి, మానవులు కృషినిసలుపుట విధాయకము; ఫలమునిచ్చుట దైవాధీనము,యని ధర్మశాస్త్రనేత్తల యభిప్రాయము అయియున్నది. అభిప్రాయములు యేవిధముగ భేదముగ నుండియున్నను, భగవదనుగ్రహము లేనిది మనము చేయుపనులేవియు తుదముట్టజాలవు. భగవదనుగ్రహము కర్మఫలము ననుసరించియే ప్రసరించుచుండును. మానవుల కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనోబుద్ధిజ్ఞానములు దైవాధీనములై ఆయనప్రేరేపణ ననుసరించియె నడుచుచుండును. కావున మానవులు భగవత్కృపపరులై, వారు యాచరించు కార్యముల జయాపజయములను భగవదధీనము చేసి పాటుపడుచూ భగవదనుగ్రహము నిమిత్తము ప్రార్థించుచుండుటయే విధాయకము. "అన్యథా శరణంనాస్తి, త్వమేనశరణం మమ, తస్మాత్ కారుణ్యభావేన, రక్షరక్ష మహేశ్వర." అనునది ప్రతిమానవునియొక్క ధ్యానశ్లోకము అయియుండవలయును.

—♦ ముగింపు ♦—

మితవ్యయము సహకారోద్యమమునకు మూలాధారము. సహకారము లేనిది మితవ్యయ ముండజాలదు. మితవ్యయము లేనిది సహకార ముండజాలదు. రెండును పరస్పర సంబంధముకలవి యగుచూ మెలగుచున్నవి. సహకారములేని మితవ్యయము వృద్ధినిబొందజాలదు. సహకారతోడుగ బనిజేయుచున్న మితవ్యయము యద్భుతముగ నభివృద్ధిలోనికి వచ్చుటకు

నావంతయు సందేహముండజాలదు. మితవ్యయముతోఁగూడు కొనిన సహకారము దేశపరిస్థితులను క్రమముగ మార్చి, దేశ మునకు పలువిధముల లాభకారి కాగలదు.. కావున మానవులు (వృద్ధులు—బాలురు, ధనవంతులు—ధనహీనులు) మితవ్యయము యొక్కయు, సహకారము యొక్కయు సిద్ధాంతములను సంపూర్ణముగ గ్రహించి వాటి ననుష్ఠానమందుంచుచూ, యితరులకు సహితము వాటివల్ల గల్గు లాభములను గురించి బోధించుచుండవలయును.

మానవుల స్వశక్తిని—మితవ్యయమును వృద్ధిపరచుటకే సహకారోద్యమము స్థాపింపబడినది. స్వశక్తిని యాధారము చేసుకొనియే, మితవ్యయము ప్రబలుచుండును. కాని సహకారసంఘములను స్థాపించుటకు ముందుగ, మితవ్యయ సిద్ధాంతములు ప్రజలలో బాగుగ బోధింపబడి, వాటి ననుష్ఠానింప వలసిన యావశ్యకతను ప్రజలకు బాగుగ దెలుపబడి యుండలేదు. కనుకనే ఉద్యమము తగినంతగ ప్రబలుటలేదు. మరియు మితవ్యయ సిద్ధాంతములు సహకార సంఘముల మెంబర్లకు విరివిగను—సంపూర్ణముగను బోధింపబడి యనుష్ఠాన మందుంచబడినగాని, సంఘములు క్రమముగ వాటి విధ్యుక్త ధర్మములను యాచరింపజాలవు.

మితవ్యయమునకు దురభ్యాసములు పరమశత్రువులు. అట్టి శతృవులను మానవులు, వారి విద్యచేతను, సత్ప్రవర్తన వల్లను సంపూర్ణముగ జయించినగాని, వారికి మితవ్యయమబ్బుటకు నవకాశముండజాలదు. చిరకాలమునుంచి యలవాటుబడియున్న దురభ్యాసములను మానుట సులభసాధ్యమైన

పనికాజాలదు. అట్టివారిని క్రమమార్గమునకు దిప్పుటకు ననేకవిధములైన ప్రయత్నములను సలుపవలసి యుండును. ఉపన్యాసములు, మ్యాజికులాంతరు ప్రదర్శనములు, దుర భ్యాసములవల్ల గల్గు నష్టములను, సత్ప్రవర్తనవల్లగల్గు లాభము లను పలువుదాహరణములతో వివరించు కరపత్రములు, పుస్త కములు, కొంతవరకు వుపయోగకరములు కావచ్చును.

మరియు "సంఘే శక్తిః" అను న్యాయరీత్యా వ్యక్తుల వల్ల గానిపనులు, వ్యక్తులతో గూడిన సంఘములవల్ల సులభ ముగ జేయబడగలవు. ఇట్లే పంజాబు దేశములో మితవ్యయ మును ప్రజలలో వ్యాపింపజేయుటకు, Co-operative Thrift Societies (సహకారపొదుపు సంఘములు) అనియు Co-opera-tive Better-Living Societies ఉన్నత జీవితము నెలకొల్పు సం ఘములు అనియు పలువిధములైన సంఘములు స్థాపింపబడి కృషి సలుపుచున్నవి. సంఘములు నిర్ణయించుకున్న మిత వ్యయ సిద్ధాంతములకు ననుగుణ్యముగ ప్రవర్తించుటకు ప్రజ లు యంగీకరించని పక్షమున, అట్టివారు సల్పు శుభాశుభ కార్య ములలో పాల్గొనుటకు సంఘ మెంబర్లు యిచ్చగించక యుం డుటయే గాక, తదితరులను సహితము సదరు కార్యములలో పాల్గొనకుండుటకు వుత్సాహపరచుటను ప్రయత్నములను సలు పుదురు. మితముగ ద్రవ్యమును వాడుకొనుటయే, వాడు కొనునట్లు జేయుటయే సంఘముల ముఖ్య సిద్ధాంతము. మిత వ్యయమును నాచరణలో బెట్టించుటయె వారి పరమ వుద్దే శ్యము. అట్టి వుద్దేశ్యమును సాగించుచూ, దేశమునకు దేశస్థు లకు వుపకారమును గావించు నిమిత్తం పలువురు పలువిధముల

పాటుబడుచున్నారు. మితవ్యయమును యభ్యసించుటకు ప్రజలకు ఉపన్యాసములు, కరపత్రములువగైరాల మూలకముగ బోధించుటయే గాక, ఆచరించుచూ దృష్టాంతములద్వారా కనబరుచుటయేగాక, బతిమాలుకొనుచూ పాదములమీద బడి సంఘమెంబర్లు స్త్రీలు, పురుషులు 'దుర్వ్యయమును' గావింపక బాగుపడుడు. మీరు మీపిల్లలు సుఖముగ నుండుడు యని పలువిధముల ప్రార్థించుచున్నారు. ఇదియే దేశసేవ యనబడును. ఇదియే మానవసేవ యనబడును. అట్టి సంఘములను మన ప్రాంతములను గూడ స్థాపించుటకు ప్రభుత్వ సహకార శాఖోద్యోగియులు కృషిసల్పి ప్రజలకు సౌకర్యములను జేయుదురుగాక. మానవజన్మ మెత్తినందుకు 'పరోపకార మిదం శరీరం' యను నార్యోక్తి ననుసరించి, సాధ్యమైనంతవరకు శక్తి వంచన లేకుండగ పరులకు నుపకారమును జేయుటకు కృషిసలుపుటయే మానవ విధాయకము అయి యున్నది. "నహికళ్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాతగచ్ఛతి" మంచిపనిని జేయువాడెవ్వడు చెడుగతిని బొందడు. ఇహపరలోకములలో నట్టివానికి శుభమే కల్గుచుండును (Good deeds are never lost).

ఒకప్పుడు షాహుకారులవద్ద వారిచ్చు యధికవడ్డీరేటుతోను, వారువిధించు షరతులతోను, ఋణములను దెచ్చుకొని సదరు వడ్డీరేటుతోను, షరతులతోను ఋణములను దీర్పజాలక నానాయిబ్బందుల బడుచూ, తుదకు బహుహీనస్థితిని బొందుట పలువురికి సంభవించుచుండెను. అట్టిదంతయు సహకారోద్యమము వుదయము కావడముతోనే, నాశనము గావింపబడి,

పలువురికి పలువిధములైన సౌకర్యములను గలుగచేయుటకు సుఖముగ కాలక్షేపము జేయుటకు సహకారోద్యమము దోడ్పడుచున్నది. ఈ సహకారోద్యమము గత రెండు సంవత్సరములనుంచియు యంతగ మంచిస్థితిలో నుండియుండలేదు. దాని ననుసరించియు, గత వుద్యమచరిత్ర ననుసరించియు, ప్రభుత్వమువారు సహితము సహకారచట్టములో ప్రస్తుత కాలానుసారముగ తగు మార్పులను గావించి, ఉద్యమమును క్రమముగ నడుపుటకు సహకార శాఖోద్యోగియులకు నెక్కువ యధికారములు నొసంగియున్నారు. మరియు రహితులు పండించు పంట ధాన్యముల ఖరీదు సక్రమముగ లేకపోవడము ఉద్యమమునకు సహకారి యగుటలేదు. పంట ధాన్యముల ఖరీదు క్రమముగ లేనిహేతువుచే, రహితులు పడు శ్రమ యంతయు వ్యర్థమగుచున్నది. మరియు వారి యార్థిక పరిస్థితులు సహితము నిలకడగనుండుట సంభవించుటలేదు. అట్టివారికి మితవ్యయముతోగూడిన సహకారమే శరణ్యము. దాని సహాయమువల్లనే వారు నిలకడనుబొంది సుఖముగ దినములను గడుపుటకు నవకాశము కలుగగలదు.

ఇవి యన్నియు యిట్లుండ, మనదేశములో పలువురు యేవిధమైన వృత్తియులేకుండగ నుండియున్నారు. అట్టివారిలో కొందరు రోజుకొకపర్యాయము, మరికొందరు రెండు రోజులకొకపర్యాయము గంజిని త్రాగుచునో, అన్నమును తినుచునో, యర్థయాకలితో దినములను గడుపుచున్నారు. ఒకప్పుడు చేతిపనులకు ప్రసిద్ధికెక్కిన మనదేశములో ప్రస్తుత దినములలో చేతిపనులకు దగు యాదరణలేని కారణముచే,

పలువురు శిల్పికారులకు పై దుస్థితి సంభవించినది. సహకారోద్యమము అట్టివారికి సహితము చేయూత నొసంగుటకు సిద్ధముగ నుండియున్నది. విశేషముగ గాకపోయినను, కొన్ని చోట్ల సహకార సంఘములు యేర్పడి, అట్టివారికి సహాయము ను జేయుచునే యున్నవి. అట్టి సంఘములు తయారుచేయు వస్తుసామగ్రిల మీద ప్రజలకు దగు యభిమానము లేని కారణముచే, సంఘములు విశేషముగ నభివృద్ధిలోనికి వచ్చుట సంభవించుటలేదు. పరదేశముల నుంచి మరలమీద తయారుచేయబడి విరివిగను, అందముగను, చవుకను మన దేశములకు బంపబడు వస్తువులమీద వ్యామోహముచే, మన దేశములో తయారుకాబడు వస్తువుల మీద నిరాదరణ భావము యేర్పడుచున్నది. అందుచేతనే మనదేశములోని చేతిపనులన్నియు యడుగంటి పోవుట సంభవించి, పలువురు వ్యక్తులు వృత్తి లేక మలమల మాడుట సంభవించు చున్నది. కావున, స్వదేశ వస్తువులను గొనవలయునను దీక్షబూని, ప్రతిమానవుడు కృషి సల్పుచుండిన పక్షమున, Noncredit side న స్థాపింపబడిన సహకార సంఘములలో తయారుచేయబడు సామగ్రిలు విరివిగ నమ్మబడి సంఘములు వృద్ధిపొందుటకు నవకాశము కల్గుటయేగాక, యేవిధమైన వృత్తియులేక తిరుగులాడు పలువురికి జీవనోపాధిని గల్గించుట కూడ సంభవించును.

మరియు కృషిసల్పి సంపాదించి దురభ్యాసములమూలకముగ దుర్వ్యయమును గావించుటవల్ల, పలువురి సంసారములవారు సహితము తినుటకు అన్నములేక, కట్టుటకుబట్ట లేక, ఉండుటకు యిల్లులేక యల్లాడుచున్నారు. అట్టివారి

పరిస్థితులను చక్కపరచుటకు, దురభ్యాసములను మాన్పి క్రమ మార్గమున నడుచునటుల జేయుటకు పలువిధముల కృషి సలుపవలసి యుండును. అప్పుడుగాని దేశము—దేశస్థులు బాగు పడజాలరు. సహకారోద్యమము వుపయోగపడజాలదు.

ఏది యెట్లున్నను పాటకజనులయొక్క గాని, శిల్పికారులయొక్క గాని, దుస్థితిని బాపుటకు, సహకారోద్యమమె మూలసాధనము. ఈ వుద్యమమునకు ప్రధానమైన సహకారమునకు మితవ్యయము తోడ్పడినగాని వుద్యమము వృద్ధి బొందజాలదు. సహకారసంఘ మెంబర్లలో పలువురు మిత వ్యయమును తృణీకరభావముతో జూచుచుండుటచే, వుద్యమము వృద్ధిలోనికి వచ్చుటలేదని కొంతవరకు చెప్పవచ్చును. కావున మితవ్యయ సిద్ధాంతములనుగూడ, సహకారసిద్ధాంతముల తోపాటుగ సంఘమెంబర్లలో సంపూర్ణముగ వ్యాపింపజేయుట సహకారుల ముఖ్యకర్తవ్యము అయియున్నది. శెంట్రిలు బ్యాంకులవారు రాజధాని బ్యాంకువారు, రాజధానియూనియనువారు శ్రమయనక, ద్రవ్యనష్టమనక పాటుబడి, సహకార సంఘ గ్రామములలో సంపూర్ణముగ ప్రబోధనను (Propaganda) గావించినగాని, సంఘమెంబర్ల స్థితిగతులు బాగుపడుటకు నవకాశము గలుగజాలదు. మితవ్యయముతో గూడిన సహకారమే ప్రస్తుత దినములలో రహితులకు శిల్పికారులకు శరణ్యామగుచున్నది. వాటి సిద్ధాంతములనే బాగుగ ప్రచురపరచడము విధాయకము అయియున్నది.

సహకారసోదరులారా! మన దేశమును, మన దేశస్థులను చక్కపరచు భారము మనదిఅయి యున్నది. వానిని బాగుగా

గ్రహించి మనస్వోదరపోషణతో సంతుష్టినిబొందుట నుచి
కాదు. మన యిరుగుపొరుగువారు మలమల మాడుచు
మనము కడుపునిండ భుజించి సుఖముగ కాలక్షేపమును జే
టకు మనసొప్పునా! . కావున మనము మన యిరుగుపొ
వారినిమిత్తం—మనదేశస్థులనిమిత్తం—మనదేశము నిమిత్తం పా
బడి యభివృద్ధికి దెచ్చినగాని మనకు సుఖము వాటిల్ల
అదియే మానవసేవ—అదియే దేశసేవ—అదియే దైవసే

సర్వేజనాః సుఖినోభవన్తు.

స్వస్తి.



